# తపోభూమి

కవితావిశారద, విద్వాన్
పండిత పెనుమెచ్చ సత్యానారాయణరాజు
జయపురసంస్థానగౌరవాస్థానకవి

## భూమిక

ఈప్రస్తుతగ్రంథమునకుఁ దపోభూమి యని పేరు. శ్రీబ్రహ్మానందానుభూతికై ఆత్మార్పణముచేయు మహాత్ముల జీవితాంశముల నిగ్గు నుగ్గడించుటకు ముఖ్యమగు తపస్సులరీతిని వక్కాణ చేయుట కాధారమైనది కానను, జగత్కల్యాణసిద్ధికై సృష్టిలోని ప్రాశస్త్యమును యథార్థముగా వర్ణించునది గావునను దీని కీపేరు సార్థకమయ్యెను.

ఇది రచించినకవి కవితావిశారద, పండితమన్నగుబిరుదము లందిన పెనుమెచ్చ సత్యనారాయణ రాజుగారు. ఈయన నాకు కనిష్ఠసతీర్థ్యుఁడు కావున ననుజతుల్యుండు. అట్లుగుటంజేసి నే నీయన కిత్తోధిక శ్రేయోఽభివృద్ధి నభిలషింప వలసినవాఁడనే కాని ఈయనయుత్కర్ష మంతగా నుగ్గడింపన ర్హతలేనివాఁడను.

ఈయనరచించిన వెనుకటిగ్రంథములు తెచ్చిన 'కవితావిశారద పండి తేత్యాది బిరుదములను నీగ్రంథ రాజము మఱింత ద్రువపఱచుచున్నదని యేతత్పాఠకులకు విశదము కాకమానదు. మఱియు నేఁటికాలమున

రాజగు ఁడేడ! కవియగు ఁడేడ! రాజును కవియునగు ఁడేడ! కవి రాజగు ఁడేడ! "కవిరా జ"గు ఁడేడ! పండితుఁ డగు ఁడేడ!, పండితుఁ డగు ఁడేడ! ఆలంకారిక గ్రంథకర్త యగు ఁడేడ యని మున్నే విద్వత్కవుల నీయన కవితాపాండిత్యాదు లాశ్చర్యపయోరాశిలో నోలలాడించుచుండ దానికి మిక్కిలి చేయూఁతమై యీగ్రంథరత్నము, ఆలంకారికశిరోమణియగు ఁడేడ వేదాంతపారదృశ్వియగు ఁడేడ! యని కడుంగడు నివ్వె ఱపాటొనరించుచున్నది

ఈగ్రంథమునం దెనిమిది భాగములున్నవి. ఇవ న్నియు తపోభూమిఁ దమలోననుస్యూతముగా నిమిడించు కొనుచున్నవి. ఇదియే యుత్కృష్టగ్రంథమునకు ఊఁత కోలవంటిలక్షణము. కవితయను నది కేవలము ఛందో బద్ధము మే యని కొందఱు గద్యముపట్ల పెదవి విఱుచు చున్నారు. దీని కాంధ్రమున గద్యగ్రంథములలోఁ దగిన పోకడలు కలవి కొఱంత గల్గుటయే ముఖ్యపోషకము.

లక్ష్య లక్షణములలో లక్షణము వక్కాణించి లక్ష్యముపట్ల మానధారణము లక్షణాబాధ్య వస్తు లాఘవమునకుఁ బోషకము. కావుటంజేసి కొన్ని విధు లకు లక్షణములనం దగు పూర్వపంక్తులకు లక్ష్యము న నొప్పు కొన్ని వాక్యములఁ గుర్తురింతును.

ప్రకృ తగ్రంథరాజమున నెన్మిది ము క్తి సోపాన ములట్టి ప్రకరణములున్నవి. అందు (గ్రంథోద్దేశము) ఆది ప్రకరణము తపోభూమి తలపెట్టిన కార్యము, బ్రహ్మసాక్షాత్కారమార్గము, సాంఘికశ క్తి మర్యాదలు మున్నగు మహావిషయజాతముతో విరాజిల్లుచున్నది.

ద్వితీయమున యుగధర్మమునందలి లోటుపాట్లు సర్వకులజాతులకు బ్రహ్మత్వసిద్ధికిఁ దావున్నదనువాదము నకు, (మతమునకు) బ్రోద్బల మగు ఋగ్వేదీయ సూక్త ములయుఁ దదర్థములయు భానరత్నములు చూపఁ బడినవి. అందు దీర్ఘతముఁడు, స్వనయుఁడు కవషుఁడు మున్నగువారిచరిత్రలు బ్రాహ్మణులకు నితర జాతులకు బ్రాహ్మణత్వము సిద్ధించుటలోని ప్రత్యే కార్హతలపరిశీల నము యుగధర్మప్రవచనము అందు వ్యక్తిత్వాను గుణ్య మగుశంకరాదుల ప్రస క్తియు మున్నగు ననేకమూల్య ములుఁ ప్రదర్శింపఁ బడి విమర్శింపఁబడినవి. వేదాధ్య యన మనఃమూఁడవదాన విద్య తదర్హతాపాత్రముల ప్రశంసములఁ దగువేదఋక్కులు ప్రాక్తనసంప్రదాయ ములు సమీక్షింపఁబడినవి.

పదంపడి బ్రహ్మచర్యమను దానవ్యుత్పత్త్యర్థ ప్రద ర్శనా ప్రభోధనా పూర్వకముగాఁ దదాచరణ పరా మర్శము గావించుట కడుంగడు శ్లాఘనీయ శైలిలో

వన్నె కెక్కి పాఠకుల కింపగుచున్నది.

యోగ మను శీర్షిక కాశ్రయ మగునైదవభాన శక్తిత్రయము తత్తద్వ్యాప్తియు నరునకు విరక్తి సూచక భావ బోధయు మోక్షమార్గ వ్యాఖ్యయు కర్మసిద్ధాంతము జ్ఞానయోగమునఁ బురుషునకు నిత్యానిత్య వస్తు వివేకము భక్తియోగము మున్నగు తావుల నియ్యది గీతానికషోపలమనఁ దగియున్నది.

యజ్ఞ మనుదాన యజ్ఞార్థనిర్వచనముపట్ల కృతార్థుఁడై తైత్తిరీయ సంహితా సూక్ష్మముల వక్కాణచేసిన గడుసరితనము ప్రశంస్యము. ఋణత్రయ నిరూపణ ద్వారా తనబోధనాశక్తి యద్వితయముగా నిరూపించుచు నందు దైవయజ్ఞాదుల నిరూపణములోఁ దనభావ ప్రౌఢిమ కవివెల్లడించినాఁడు

పురుషార్థము లను ప్రకరణమునఁ గల్పితమై ధర్మార్థకామముల భావప్రకటనమందుఁ బ్రపంచితమైన గ్రంథకర్తృ నైపుణ సర్వస్వము శ్లాఘాపాత్రమై శ్రీజవ్వాదిసౌరభమును జెట్టఁబట్ట నర్హత గడించి వారి కాచంద్రార్కకీర్తి నార్జింపఁగలదని యుగ్గడించుచున్నాను.

తుదకు 'మతమను' కడపటి ప్రకరణమున ఆర్ష మత నిరూపణావసరమున స్వమతప్రాబల్యసంపాద

నార్థము శతపథబ్రాహ్మణాదుల నుపయోగించుకొను తేవ
గను పాఠకులకు ఈవాంఛితా ర్థానుభూతి కై బుద్ధిప్రస
రించుట కాస్కారముత్పన్నమై తరించుటకు బాట
సుగమముగా బుద్ధి కందుచున్నది. యోగము నభ్య
సించియు, బ్రహ్మచర్యముఁను బాలించియుఁ బురుషార్థ
నిష్పత్తి గ్రోలియుఁ జరితార్థులగుటకుఁ దత్తద్గ్రంథముల
మేటికిరీటి నాఁబడు నీగ్రంథము గద్యమయమైనను
ప్రారంభించినదాది సమాప్తమగువఱకుఁ బాఠకుల మైమ
ఱపించు శక్తిగల్గిపఠింపఁజేసికొను మహిమగల శైలిలో
వెలసియుండుట దీనిరచనావైశిష్ట్యము అస్మద్గురువరుల
కీర్తిని ( శ్రీచర్లనారాయణశాస్త్రిగారు ) మాసంప్ర
దాయమును బ్రదర్శించుచున్నది.

వైదికగ్రంథమనఁ దగియుండియు "మోడు
వాఱిన చెట్లన్నియు పైరుగాలికిఁజిగుర్చునట్లు" మున్నగు
నలంకృతులకుఁ దావై చక్కని చిక్కని యాదర్శముల
కుఁబ్రోవై భావ బోధోల్బణశక్తి నినుమడించు ఘట్టముల
కనుక్రమణికయై మారాజుగారినిమమ్ములను దృప్తి
పఱుప నర్హతగడించినదని అగ్గించుచు శ్లేషించిన విషయ
ములు పాఠకులు గ్రంథమునఁగ్రహింపఁగోరు చున్నాను.
ఈకాలమున మంత్రములయందు శక్తి కానవచ్చుట
లేదు. బ్రాహ్మణాదుల నుండవలసిన తేజోమహిమంబు

లొక్కరియం దేని కన్పట్టకుండె. జీవజాలమందు వెను కటివానిశక్తి మృగ్యంబు. తరుగుల్మ లతాదులయందుఁ గూడఁ బూర్వ పుష్ప ఫలాది సమృద్ధి నిక్కలి కొలఁ వడియెను. వెనుకటి యాచారములు పనికిరాకుండుటయే గాక అనర్థదాయకములుగాగూడ నగునని యెంచఁబడు చుండె. ఇక్కట్లు ప్రజలకు వాటిల్లినపుడుపూర్వకాలమున నేరాజో ఏమహర్షియో, లేక స్వయముగా దేవదేవుఁ డేస్వరూపముననో యవతరించియో యాయిక్కట్లు రూపు మాపి దేశక్షేమము నెలకొల్పినట్లు పురాణములు నుడువుచున్నవిగదా! ఇప్పుడాచారములు కొన్నితప్పక మాఱవలెను. అధర్మమ్ములేకుండమార్చువలంతిచూపట్టఁ డయ్యె. భగవంతుఁడే నట్టుచేయుట కిప్పటికవతరించ లేదు. "ఎప్పు డేరూపమున నవతరించి యీవిపత్తు నిర్మూ లించునోగదా!" యని పెక్కురు తహతహపడుచుండుట యసత్యముగాదు. ఇట్టి సందర్భములోనద్యతనప్రజల య దృష్టములు ఫలోన్ముఖములై యుండుటఁజేసి పైనుడువఁ బడిన యిక్కట్లెల్లఁదునిమి తూఁటాఁడి తన్నాశ్రయించిన వారికెల్ల సద్గుణములలవడఁజేసిజ్ఞానోపదేశమునకర్తలగు నట్లొనర్చుటకె యీతపోభూమి విలసిల్లుచుండెననియు దీని మహిమలు వాక్కున కందరానివనియు జిరకాలానుభవ ముచే నీగ్రంథముద్వారా మాసతీర్థ్యులు నిస్సందేహ

ముగా సహస్రముఖముల నుద్ఘోషించుచున్నారు.

సమర్థుఁ డవలంబమ్ముగా లభించినప్పు డదివఱ కధర్మమేమైనను ధర్మమేయగును. రాజు బ్రాహ్మణస్త్రీని వివాహ మాడుట యధర్మమే మైనను శుక్రాచార్యావలంబముచే యయాతి కది ధర్మవిరుద్ధము కాక యాచరణీయ మయ్యెనుగదా ?

కావున నిదిధర్మమా ! అధర్మమా ! యనుచింతతో మనకుఁ బని లేదు. సమర్థాధారము లభించుచున్నది. కావున దీని నాశ్రయించి యిప్పటి యిక్కట్లెల్లఁ బాసి యెల్లరు తరింతురుగాకయని యీరాజగ్రంథముద్భవించె నని తెలుపుచు నీప్రసంగమునుండి విరమించుచుంటిని.

ఈనవీనో త్తమకృతికి నాయకుఁడు జవ్వాది కులకలశాబ్ధి రాకానిశాకరుం డగులక్ష్మయార్యుని కొమారుఁడు. ప్రసంగమ్ము వచ్చినప్పు డుత్తమగుణములగు రసికవరుల యాథార్థ్యమ్ము నుడువుట కవులకు సహజగుణమ్ము. ఈకృతిపతితండ్రిగారికిఁ బండితులయందును పండిత ప్రసంగమ్మునందును పండితగోష్ఠులయందును గలయానందోత్సాహములు వర్ణనాతీతములై వెలయుచున్నవి. ఈ సుగుణాలవాలుండు అధమపక్షము నెలకొకపండితగోష్ఠి యైనను సలుపక యుండలేఁడు. ఈవదాన్యశిరోమణి తనయూరునకుఁ జుట్టుపట్టుల నున్న పండితగ్రామములకు

స్వయముగా విచ్చేసి పండితగోష్ఠి సలిపి తనివినొందఁడు. వీనిపట్ల ఈనిగర్వమూర్ధన్యుని ప్రవృత్తి అతిపునరుక్తి భూయిష్ఠము. ఈతనిసత్కారమునడయనికవియుఁ బండితుఁడును ఆంధ్రమ్మున లేఁడన నత్యుక్తిగాదు. మఱియు నీ నిర్లిప్తుని యశోధన సమార్జన చాతుర్య మత్యాశ్చర్యకరము. మఱియు నీ ప్రజ్ఞా ఘనుని సహాయమ్ము వడయని సదుద్యమమ్ము-ఈ యాంధ్ర దేశమ్మున మృగ్యమ్ము. ఇట్టియుత్తముని పుత్రునకుఁగీర్తిశేషునకు వేంకటరామశాస్త్రికి వయస్సుచే నెల్లరకన్నను కనీయసియయ్యును నిరుపమాన నవీనోత్తమగుణములచే సర్వజ్యాయసియై యన్యాదృశ గుణధుర్యుఁడైన వానికీవైదికగ్రంథమునొసఁగి కృతకృత్యుఁడైనమాసోదరుని ధన్యతకును మిక్కిలిగర్వాంధతచే విఱ్ఱవీఁగుచు నెట్టకునేని యీప్రసంగమ్మునుండి మనంబు మరలించుకొనుచుంటిని.

కొవ్వూరు
30-7-42

వేదుల రామశాస్త్రి
ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము
సంస్కృతాంధ్ర ప్రధానోపాధ్యాయులు.

# నివేదన

కారణము లేని కార్యోత్పత్తి యుండదు. నా యీతపోభూమి రచనకుఁ గారకులు శ్రీ బాలబ్రహ్మానంద యోగులు.(కళవరము, తెనాలి కైవల్యాశ్రమము)వారు చేసిన తపోయజ్ఞమునకు నన్ను ఆహ్వానించిరి. ఎందులకో నేను వెళ్ల లేకపోతిని. పిమ్మట వారే మాయింటికి దయ చేసిరి. వారిప్రోత్సాహమునకుఁ బ్రతిఫలమే యీ గ్రంథము.

భగవత్పరముగాఁ జేయు నాలోచనయే తపస్సు. భగవంతుఁడు అందఱియొక్కయు సొత్తు. భక్తిచేఁ గొందఱు, జ్ఞానముచేఁగొందఱు, త్యాగముచేఁగొందఱు, యాగముచేఁగొందఱు, యోగముచేఁ గొందఱు, రాగ ముచేఁ గొందఱు, తపస్సుచేఁ గొందఱు భగవంతుని సేవించుచుందురు. తరించుచుందురు.

భ్రాజన్నతితరా మర్కాత్
అవదాత తరో హిమాత్
ఆకాశా దప్యణుతరో హృద్గః
ఆ త్మాహ మేవ సః

ఖరకరునికంటె మిక్కిలి మెఱయు నదియు
మంచుకంటెను తెల్లనై మించునదియు
ఆకసముకంటె దద్దయు నణువు నగుచు
నాత్మగత మైన యాపరమాత్మ యేన.

అని యాత్మసాక్షాత్కారముఁ గాంచినవాఁడు నిష్కామకర్మముచే జాతి మత భేదములు లేకుండ సర్వులను తరింపఁజేయును.

యదృచ్ఛా లాభ సంతుష్టుఁడు, ద్వంద్వాతీతుఁడు, విమత్సరుఁడు, జ్ఞాని యైనవాఁడు విద్యావినయ యుక్తుం డగు బ్రాహ్మణునియందును గోవునందును ఏనుఁగునందును, కుక్కయందును, సమదర్శనుఁడై తా నే కర్మముచేసినను 'ఇదం న మమ' ఇది నాది కాదు. అని చేయును.

ఇట్టితత్వమును బోధించునదియే తపోభూమి. దీని నాశ్రయించినవారు పొందు ఫలము మోక్షము. మోక్ష మే భగవంతుఁడు; భగవంతుఁ డే మోక్షము. వీని ననుసంధించునదియే తపోభూమి.

తపోభూమినిఁ దమ పెద్దకుమారుఁడు కీర్తిశేషుఁడు వేంకటరామశాస్త్రి పేర అంకితమిడఁజేసినవారు కవికులాలంకార వాఙ్మయోద్ధారక శ్రీ జవ్వాది లక్ష్మయ్యగారు.

తలవనితలంపుగా ఈగ్రంథరచనము గావింపఁ బడినది. అంతకంటెఁదలవనితలంపుగా శ్రీ లక్ష్మయ్యగారీగ్రంథమును దమపుత్త్రాంకితముచేయించిరి.
"ఏజన్మంబున జేసినట్టిఋణమో యీజన్మలోఁ దీర్చితిన్."

ఈగ్రంథము మాగురువర్యులు స్వర్గీయ శ్రీ చర్ల నారాయణశాస్త్రిగారి యాశయమ్ములకుఁ బ్రతిబింబము. కావుట ధన్యుఁడనైతిని.

ప్రోత్సాహకులగు శ్రీ బ్రహ్మానంద యోగులకు, ఆయాచితముగా గ్రంథము ముద్రింపించిన త్యాగధనులగు శ్రీ జవ్వాది లక్ష్మయ్యగారికి పీఠికవ్రాసిన వ్యాకరణాచార్య, సాహిత్యచక్రవర్తి శ్రీ వేదుల రామశాస్త్రిగారికిఁ గృతజ్ఞతాపూర్వకాభినందనవందనములు. నాయభివృద్ధియే తమయభివృద్ధిగా నెంచి మరియు శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మ మహారాజవర్యులను శ్రీ రామకృష్ణ ఐ.సి.యస్, గారిని రాయలక్ష్మబ్బువారిని ఇయ్యెడ నగ్గింపకుండ నెట్లుండఁగలను?

సత్యనారాయణరాజు.

## Reference Books

1 ఋగ్వేదము.
2 యజుర్వేదము.
3 మనుస్మృతి.
4 ఆపస్తంబసూత్రములు.
5 భాగవతము.
6 భారతము.
7 భోజప్రబంధము.
8 ఐతరేయబ్రాహ్మణము.
9 శతపథబ్రాహ్మణము.
10 పూర్వమీమాంస.
11 పరాశరగృహ్యసూత్రములు.
12 అథర్వణసూత్రములు.
13 భగవద్గీత.
14 భవిష్యపురాణము.
15 స్కాందపురాణము.
16 చరకసంహిత.
17 ముండకోపనిషత్.
18 సాంఖ్యకారికలు.
19 శాండిల్యసూత్రములు.
20 నారదభక్తిసూత్రములు.
21 సూర్యగీత.
22 తై-సంహిత.
23 బృహదారణ్యకోపనిషత్తు.
24 బ్రహ్మసూత్రములు.
25 తైత్తరీయోపనిషత్.
26 కుమారసంభవము.
27 జైమినిసూత్రము.
28 కఠోపనిషత్.
29 దేవీభాగవతము.
30 హరివంశము.
31 మల్లాదివారి సంస్కృత వాఙ్మయచరిత్ర.
32 హర్షచరిత్ర.



జవ్వాది వేంకటరామశాస్త్రి

ఉదయము—3-9-1920 అస్తమయము—6-11-1942

కలకలలాడు మోము, తెలి
గన్నులు, బంగరురంగుమేను, భృం
గుల నిరసించు వంగురులు,
కోమలభావము, జాలిగుండెయున్
అలుగనిత్యాగమున్ గలిగి
యందఱుఁ దన్పొచుఁ, గీర్తిశేషుఁడై
వెలుఁగు జవాది కంకితము
వెట్టుదు వేంకటరామశాస్త్రికిన్.

# కృతిసమర్పణము

శ్రీనరసింహానుజునకు
మానారీనిలయునకును మాన్యాత్మునకున్
దానాపరనామధేయున
కానందవనీవిహారి కతులితమతికిన్.

శ్రీపెనుఁగొండ పురీ సు
స్థాపిత సర్వాధికార సంస్థా సమ్య
గ్దీపాయమాన నిజ ధీ
వ్యాపారయుతునకుఁ దెలుఁగ వంశజమణికిన్.

శ్రీజ్ఞానపూర్ణమతికిన్
ప్రాజ్ఞశిరోమణికి సర్వరసికాగ్రణికిన్
తజ్ఞజనవర్ణ్యశీలున
కజ్ఞాగమ్యునకు లక్ష్మయాఖ్యాకునకున్.

శ్రీద్వైతాద్వైత కవీ
ణ్మాద్వీకా హృద్య వాక్య తృప్తాత్మునకున్
హృద్వీథి కానుకల రా
జద్వైకుంఠాంఘ్రియుగళ సాధితగతికిన్.

శ్రీగీతా సత్కృతి క
న్యా గీతామృత ధునీ మహాకావ్యవధూ
భోగాంచిత జలకేళీ
రాగ పరిక్రమ జవాది లక్ష్మయగుణికిన్.

కడుపునఁజిచ్చు పెట్టి కొడుకా!యని యేడ్వఁగఁ జేసి స్వర్గమం
దడుగిడినట్టి వానికి ననంతయశోధని కశ్రుతర్పణం
బిడి,యిడువాఁడ నీకృతిన హీనుఁడు వేంకటరామశాస్త్రికిన్
ఉడుగని దుఃఖమున్ దణఁగియుండిన లక్ష్మయ సూఁజడింపుగాన్.

మిత్రార్థంబుగఁ దర్పణం బిడుట భూమిన్ ధర్మమై యుంటచే
సుత్రామాల మనాయకుండ వగునీశుద్ధాత్మకుం దృప్తియా
క్షేత్రంబై తగు నక్షరంబగు తపఃక్షేత్రంబు సారస్యపుం
బాత్రంబారఁగఁ దర్పణంబిడితి రామా! కొమ్ము సాయుజ్యమున్.

ఆనతవైరి లక్ష్మయకు నగ్రతనూజుఁడ, వేతదగ్రజ
శ్రీనరసింహనాయకుని చేతను బెంపక మందినావు ల
క్ష్మీ నయనాబ్జ భృంగమనఁ జెల్లితి వేంకటరామశాస్త్రి! నీ
కీనవకావ్యదివ్యసుధ నిచ్చితిఁ గైకొను మక్షరంబుగాన్.

వేదంబుల్ మఱివానియంగములు సంవీక్షించి స్మృత్యర్థమెం
దా దేయంబని లో నెఱింగికొని కావ్యాదేశముల్ గాంచి జ్ఞా
నాదాయంబు గడించి మించు నవకావ్యార్థంబు కైవల్యపుం
దాదాత్మ్యం బిడ లక్ష్మయాగ్రసుత! స్నిగ్ధఖ్యాతి శోభిల్లుమా!

ఆదిన్ లక్ష్మిని బెండ్లియాడి సుఖియై యామీఁదగీతాంగనా
న్యాదృగ్భావవిశేష సంఘటిత సౌహార్దుండు నీతండ్రిస
న్మోదాత్మాకృతి మామకీనను తపోభూమీకృతిన్ సద్యశ
శ్శ్రీదన్ వేంకటరామశాస్త్రి!యిడఁజేసెన్ నీకుఁగైకోఁగదే!

బక్కవాఁ డెవఁడైనఁ బ్రక్కఁ జేరినఁ జాలుఁ
గనకాభిషేకంబు గాంచు నతఁడు
గృహహీనుఁ డెవఁడైన నెదుట నిల్చినఁ జాలుఁ
గోమరారునింటితోఁ గులుకు నతఁడు
అవివాహుఁ డెవఁ డైన అగపడినంజాలుఁ
బెండ్లియై భార్యతో వెలయు నతఁడు
బండివాఁ డెవఁడైన నండ నుండినఁ జాలు
నవవాహ శకటాఢ్యుఁ డవునతఁడు
తావకోదార మధుర కథా ప్రశస్తి
అవని నాబాలగోపాల మందఱకును
శ్రుతచరం బగు నౌర ! నిస్తులగుణాభి
రాము! జవ్వాది వేంకటరామశాస్త్రి!

## విషయసూచిక

శ్రీజన్యాదికులాంబుధి
రాజా! కవికల్పభూజ! రవిసమ తేజా!
రాజద్రూపమనోజా!
భ్రాజద్గుణజాలభోజ! భాగ్యబిడౌజా!
దివ్యచిత్తంబున అవధరింపుము.

# తపోభూమి

## నవీనోద్యమము

ఏఁబది సంవత్సరములనుండియు భారతవర్షము సర్వతోముఖ సంస్కరణము గోరి చిత్త సంక్షోభము నొందుచున్నది. పురాతన నవీన కాలములకు పోరాటము జరుగుచున్నది. ఆర్యానార్య వైషమ్యము సంభవించినది. దీనివల్లఁ గలుగుచున్న పరివర్తనములకు లెక్క లేదు. సంఘము కదల నారంభించినది. ప్రాఁత పద్ధతులుపోయి క్రొత్త యాచారములు వచ్చుచున్నవి. చిత్తమున శాంతిలేదు. సంఘములో స్తైమిత్యములేదు. సాధ్య సాధనములకు సామంజస్యము లేదు. త్రోవలు పెక్కు లైనవి. లక్ష్యములు వ్యత్యస్తము లైనవి. మార్గదర్శకు లనేకులు వచ్చుచున్నారు. కార్యకారులు వివిధ సాధనములను నిర్మించుచున్నారు. కాని మార్గదర్శకులు వచ్చిన కొలఁదియుఁ, గర్మక్షేత్రము చీకాకు పడుచున్నది. ఏమతమునకు నిలుకడ లేకున్నది. ఏకార్యమునకు స్తైమిత్యము కుదరకున్నది. ప్రచండమారుతమున సంక్షుభితమగు జలధిభంగి, భారతవర్షమునఁ

బెక్కు మతములు నానాసంప్రదాయములు, అనేక పరి వర్తనములు, సభలు, మఠములు, మార్గములు, ఉపాస నలు, సంస్కరణములు, తరంగములవలె లేచి పెరిగి, విరిగి, తిరిగి అవ్యాకృతమగు వైదికమతసాగరములోఁ బడుచున్నవి. ఎంతకాల మీసంక్షోభము ? ఎంతకాల మీప్రచండకల్లోలము ? మానవజీవన మీయొత్తిడిని చిరకాలము భరింప లేదు. సంఘము క్రమముగాఁ దిరుగుటకును బెరుగుటకును మధ్య సాధన మొకటి చిక్కవలెను.

భారతవర్షమును గదలించుచున్న సర్వసంస్కర ణములను దిరిగి, నూతన దృష్టితోఁ బరిశీలించ వలసిన తరుణ మాసన్న మైనది. జ్ఞాన సౌధ నిర్మాణమునకు ఆరోహణమునకు వలయు నూతన పరికరములను నవీన సోపానములను నిర్మింపవలసియున్నది. సర్వోద్యమము లకును సామరస్యము గలిగింపవలసి యున్నది.

భారతవర్షముయొక్క సాంఘిక ఆర్థిక రాజకీయ పారిశ్రామిక, పారిజ్ఞానిక ఆధ్యాత్మిక లక్షణములను గ్రహించి విశాల విశ్వమానవ జాతికిఁ బ్రత్యేక మైన పరిజ్ఞానమును ఆధ్యాత్మిక సంపత్తిని అర్పించుటయే యీనూతనోద్యమముయొక్క ముఖ్యాశయము, ముఖ్య సందేశము.

ఈనూతనోద్యమము నూతనోజ్జీవము క్రొత్తగా సృష్టింపఁబడినది కాదు. సర్వమానవకోటియందును నిండి నిబిడీకృతమై యున్న దివ్యశక్తియే యీపరిణామావస్థ నిప్పుడు పొందియున్నది. దృశ్యాదృశ్య ప్రపంచమంతటియొక్కయు గమనికకు హేతుభూతమై చైతన్యస్వరూపమున జీవరాసు లన్నిటియందును మూర్తీభవించియున్న పరతత్వమే యీనవశక్తి. కనుకనే యీనూతనోద్యమము కేవలము రాజకీయోద్యమము కాదు, ఆర్థికోద్యమము గాదు, సాంఘికోద్యమమును గాదు. ఆధ్యాత్మికము, జ్ఞానసంబంధము. మనుష్యుఁడు చిద్రూపుఁడైన భగవంతుండు. ఈచిద్రూపములో బీజరూపమున నున్న చైతన్య శక్తులను ఐహిక జీవితము ద్వారా వృద్ధి పఱచి దేవత్వమును అనుభవములోనికిఁ దెచ్చుకొనుటయే యీ నూతనోద్యమముయొక్క యుద్దేశము. వేదాంతముయొక్క అత్యంతోత్కృష్టమైన దివ్యజ్ఞానముయొక్క సాంఘిక, ఆర్థిక రాజకీయ జీవనమునందుఁ దన ప్రయోగమును జూపి స్వాతంత్ర్యముయొక్క వార్తను బ్రచురించుట దీని యుద్దేశము. సాంఘి కార్థిక రాజకీయ జీవితమందు అట్టి పరమార్థమును అనుభవములోనికిఁ దెచ్చుకొనుటయే వేదాంతముయొక్క యుత్తమవార్త మైయున్నది. ప్రతిజీవుఁ

డును తనయథార్థ స్థితిని ఆత్మయని దెలిసికొనుటయె వేదాంతముయొక్క తాత్పర్యము. ఈశ్వరుఁ డెట్లు నిత్య శుద్ధ ముక్త బుద్ధ స్వరూపుఁడై యున్నాఁడో అట్లే ప్రతిమానవుఁడును స్వతంత్రుఁడై ముక్తుఁడగు స్వభావము గలిగియున్నాఁడు. స్వాధీనత మనుజుని 'జన్మహక్కు'. అది యీశ్వర ప్రసాదిత మైనది. మనుజుని నిర్మాణమందే యది సహజమై యున్నది. మనుజుఁడు దేవుని ఛాయకాదు. బ్రహ్మపదార్థమే. దైవము నిత్య ముక్త స్వతంత్రుఁ డైనట్లు మనుజుఁడు స్వతంత్రుఁడే. రాజు రయితు, బ్రాహ్మణుఁడు పంచముఁడు, పురుషుఁడు స్త్రీ, హైందవుడు మహమ్మదీయుఁడు, బౌద్ధుఁడు క్రిష్టియను, పేద భాగ్యవంతుఁడు, విద్యాహీనుఁడు విద్యాధికుఁడు అందఱును స్వతంత్రులు, నిత్యులు. స్వాతంత్ర్య మనఁగా నిగ్రహము లేకపోవుట కాదు, ఆత్మనిగ్రహము. స్వాతంత్ర్యమనఁగా నియంతృత్వ హీనము కాదు, స్వయంనియంతృత్వము. స్వాతంత్ర్య మనఁగా ఆత్మనిశ్చయ విహీనత గాదు, స్వాత్మనిశ్చయము.

ఈయుద్యమము ప్రత్యణువునందును వ్యాపించుచున్నది. ఈవ్యాప్తికిఁ బరిమితి లేదు. ఈయుద్యమమున కెన్ని యిక్కట్టు లొనఁగూడినను బ్రత్యణువునందు వ్యాపించి, సర్వ మానవ కోటినిఁ జలింపఁ

జేయుచుఁ, దొలుదొల్తఁ గొందఱు వ్యతిరేకాభిప్రాయులుగ నుండినను దుద కొడఁబడునట్లు చేయుచున్నది. అందుచే నీయుద్యమము ఆధ్యాత్మికచలనము గాని కేవలము మానవనిర్మితములోఁ గల్పితము కాఁ జాలదు. మానవులు ఈశ్వర సందేశమును వ్యాప్తికిఁ దెచ్చుటకు సాధన భూతులు. స్వయంభూత్వముకొఱకు ఈశ్వరునియందలి స్వయంనిగ్రహము, స్వయంనియంతృత్వము, స్వయం మనోనిశ్చయముల యొక్క స్వతంత్రతను మనము గ్రహించినయెడల ఈనవీనోద్యమము ద్వారా మానవజాతి దైవనియమితమైన గమ్యస్థానము చేరఁ గలదు. ఇట్టిగమ్యస్థానమును జేర్చుటకే యీతపోభూమి వ్రాయఁబడినది. జ్ఞానసందేశము నొసంగుటయే దీని కృత్యము. వైకల్యమును బొందిన వారిని సముద్ధరించుటయే దీని యాశయము. బలహీనులను సహజ బలవంతులుగను, స్వార్థపరులను స్వార్థపరిత్యాగులుగను జేయుట దీని దీక్షాఫలము. కావుననే యిది తపోభూమి యైనది. శీఘ్రముగను నిదానముగను తన యుద్యమమును సాగించి లోకమును ప్రబోధించి యజ్ఞానాంధువునుండి సముద్ధరించి యీశ్వరానుగ్రహ పాత్రమును గావించుటయే తపోభూమి తలపెట్టిన కార్యము.

ప్రపంచమునందలి ప్రత్యుద్యమమును మానసికముగా ఉత్పన్నించి వాచికముగా బయల్వెడలి సిద్ధాంత రూపమును దాల్చి, మహాశక్తిగా మారి జనసమూహముయొక్క మనస్సులలో ఉద్రేకము పుట్టించి కార్యకరణమునకుఁ బురికొల్పును. ఈనూతన నోద్యమము క్రమముగా సంఘము నందంతటను వ్యాపించుచున్నది. ప్రతివాఁడును ఋణత్రయమును దీర్చివేయుటకుఁ బ్రయత్నించు చున్నాఁడు. గ్రంథములు, గీతములు, వ్యాసములు వ్రాసియు పత్రికలు ప్రచురించియు ఈనవశక్తిని విజృంభింపఁ జేయుచున్నాఁడు.

మోడువాఱినచెట్లన్నియుఁ బైరుగాలికిఁ జిగుర్చునట్లు మోసు చెడియున్న మానవ హృదయముల యందుఁ గ్రొత్తకోర్కెలు చిగు రెత్తుచున్నవి.

బలహీనునకు బలమును, భీరువునకు ధీరత్వమును, దుఃఖితునకు సంతోషమును, లోభికిఁ ద్యాగమును, దేశద్రోహికి దేశాభిమానమును, స్వార్థపరునకుఁ బరోపకారబుద్ధియును, ద్వేషబుద్ధికిఁ బ్రేమయును, విరోధుల కన్యోన్యమైత్రియుఁ, గలిగించునది తపోభూమి. ఈశ్వరారాధనమే దీనిమతము. తద్వ్యతిరేకమే నాస్తిక్యము. మానవ మాత్రుల నందఱను ఏకసూత్రమున బంధించి జాతి మత భేదము లణంచి ధ్యే

కేశ్వరారాధనకుఁ బురికొల్పుటయే తపోభూమి చేయఁ బూనిన ప్రథమకృత్యము. వేదమతమే దీనిమతము తదన్యము గాదు.

ఈయుద్యమముయొక్క బాహ్యరూపములు, సంఘ హృదయాంతరమునఁ బ్రవహించుచున్నశక్తి యొక్క బాహ్యచిహ్నములు. సంఘమునం దంతర్గర్భితము లైనశక్తులు వ్యక్తమగుచున్నవి.

విశాల విశ్వ మానవజాతియొక్క జీవనమునకుఁ దా నార్జించిన పరిజ్ఞానమును, నాగరికతను, మనోరథంబులను సమర్పించి, తత్కారణమున నింకను ఉత్తమమైన, ప్రియమైన, దీర్ఘమైన, సచేతనంబైన నిజమైన విశ్వాసమును విజృంభింపఁ జేసి విఘ్నము లెన్ని వచ్చినను, ఎందఱు పరిహసించుచున్నను, అణఁగిపోవుటకు బదులు మఱింత సాఁగుచు, వృద్ధిచెందుచు, విస్తరించుచుఁ, జెలరేఁగి తన విధ్యుక్త కార్యము నెఱవేర్చుకొనుటకే తపోభూమి బద్ధకంకణమైయున్నది. భిన్న జాతులకు, భిన్నమతస్థులకు, భిన్నవర్ణములవారికి, సామాన్య మనోరథంబును, సామాన్య పరమావధియుఁ జూపఁ బడిన యెడల భేదము నశించును. అభేదభావ మలవడును. అద్వైతము ప్రచారమునకు వచ్చును,

ద్వైధీభావము అడుగంటును, బ్రహ్మసాక్షాత్కారము కలుగును.

భూలోకమునందలి నాగరకజాతులన్నియు బలమందును, ఐశ్వర్యమందును, ముందంజవేయుచు ఆశాంత విశ్రాంతము లగుపేరు ప్రతిష్ఠలను వహించియుండ మనమేమియు చేతగానివారివలెఁ గాళ్లు చాఁచుకొని దిగాలుపడి ఆకాశమువంకఁ జూచుచున్నాము. మన పూర్వుల వేదాంతమును, ఆముష్మికపరత్వమును దీనికిఁ గారణమని యాధునికులు కొందఱందురు. కాని యిది కేవలము పొరపాటు. వేదాంత సత్యముల నుపదేశించుచు, పారమార్థిక రహస్యముల యోగాభ్యాసాదులచే స్వానుభవమునకుఁ దెచ్చుకొని 'సోఽహం బ్రహ్మ' యను పరమార్థ తత్త్వమును గ్రహించి 'ఆనందో బ్రహ్మ' యను అమృతవాక్యము నర్థము నంతర్లీనము గావించికొని యాత్మానందమున నోలలాడుచుఁ దన్నాశ్రయించిన సంఘమును బ్రహ్మానందమునఁ దేల్చి సముద్ధరించునది తపోభూమి.

స్థిరకృతి నుతిపాత్రా! దేవతా రాజమిత్రా!
సరళ హృదయ గమ్యా! సారసౌహార్ద రమ్యా!
సురనుత గుణధారీ! శోభితాంతస్థ శౌరీ!
భరిత సకలదీనా! ప్రస్తుతాత్మాభిమానా!

శ్రీపతి సక్త విచారా!
వ్యాపిత సత్కీర్తి ఘోషి దాత్తశరీరా!
ద్యోపండిత నిభ సరసా
లాప చమత్కారసార రామకుమారా!
దివ్యచిత్తంబున అవధరింపుము.

# తపోభూమి

## యుగధర్మము.

సర్వాంతర్యామియైన సర్వేశ్వరుని చిద్విలాసంబులు మహానుభావుల జీవితంబులందుఁ బ్రతిబింబితంబులగుచుండును. సకల దేశములందును వీరులు, శూరులు, కవులు, పండితులు, మతస్థాపకులు, సంస్కర్తలు, భక్తులు పుట్టి దేశము నుద్ధరించి, ప్రజావబోధమును గావించిన విధము ఇతిహాస ప్రసిద్ధము. శ్రీరామాది శూరాగ్రేసరుల పవిత్ర చరిత్రము లార్యుల సాహస ధైర్యములకు నిదర్శనములు. కాళిదాసాదికవిశేఖరుల మహాకావ్యములు మనోజ్ఞ భావముల కాకరములు. శాయ నాచార్యాది పండితవర్యుల మేధాసంపద బుద్ధి వైభవమునకుదోహదము. బౌద్ధాదిమతస్థాపకుల తత్త్వోపదేశము తరణోపాయమునకు మూలము. రామానుజాచార్యాది సంస్కర్తల శ్రేష్ఠాచరణములు సౌహార్దమునకుఁబ్రమాణములు. పోతరాజుమున్నగు భగవద్భక్తుల భాగవతకథనములు పరమానందకరములు. శివాజీ మున్నగు దేశభక్తుల మహాత్యాగము దేశభక్తికిఁ

బవిత్రనిదర్శనము. దేశోద్ధారకుల పవిత్ర చరిత్రలను వినుటవలనను, మననము చేయుటవలనను ధ్యానము చేయుటవలనను తన్మయత్వము సాధ్యము కాఁగలదు. మన భావ్యభ్యున్నతికై పాటుపడుటకు గతౌన్నత్య జ్ఞానము సాధనము. ఆత్మప్రత్యయము లేని మానవులకు ఇహము, పరముగూడ దుర్లభము. ఆత్మవిశ్వాసము గడించుటకై దేశోద్ధారకుల పవిత్ర జీవిత రహస్యములను గ్రహించుట మహత్తర సాధనము. జాతీయావబోధము గలుగుచున్న వర్తమాన యుగమునందు జాతీయ ప్రత్యభిజ్ఞానము గలుగుటకు మహాపురుషుల చరిత్రపఠనము ప్రయోజనకారి యగును. వారి దర్శనము మోక్షదాయకమగును. మహాపురుషుల జీవిత రహస్యములను గ్రహించిన సేవాపరాయణులము కాఁగలము. మహాపురుషులు యోగవిజ్ఞానమును వెదజల్లు బ్రహ్మస్వరూపులై తఱచుగాఁ దపోభూముల యందు యోగాభ్యాసాదులచేఁ దాముతరించి యితరులను దరింపఁ జేయుచుందురు. మానవుఁ డెన్నిమహాభోగములను అనుభవించుచున్నను ఆత్మానందమును బరిపూర్తిగా అందఁజాలకున్నాఁడు. బ్రహ్మానంద స్థానమును పొంద లేకున్నాఁడు. అది కాదిది యని యెన్నియో వేడుకలతోఁ గాలము పుచ్చుచున్నాఁడు. కాని శాంతి

పదమును పొంద లేకున్నాఁడు. మానవ హృదయమునకు పుష్టి శాంతి ఇచ్చువారు బ్రహ్మానందులగు యోగులు మాత్రమె. వారి వదనము ఆనందమునకు నిలయము. వారి హృదయము కారుణ్యమునకు ఆలవాలము. వారి చూపులు చంద్రజ్యోత్స్నలు. వారిపలుకులు అమృత ఘుటికలు. వేయేల వారిసేవ మోక్షప్రదాయిని. యోగులు జ్ఞానులు; జ్ఞానులకు కులగోత్రములతో నిమిత్తము లేదు. పురాణఋషు లందఱును వేఱు వేఱు కులములకు తెగలకు చెందినవారె. వారందఱు బ్రహ్మత్వము పొందిరి. వారి నేసంఘము పరిహసింప లేదు. వెలివేయ లేదు.

ఋగ్వేద దశమమండలములో బ్రాహ్మణ రాజన్య వైశ్య శూద్ర శబ్దములు నాలుగు చతుర్వర్ణ వాచకములుగా నొక్కఋక్కునమాత్రము (ఋ10—90—12) ప్రయోగింపఁబడెను. అందే బ్రహ్మ శబ్దము మఱి కొన్ని ఋక్కులలో బ్రాహ్మణ వర్ణ బోధకముగాఁ గనవచ్చుచున్నది. (ఋ 1)—85—3, 29, 34, 35) రాజ శబ్దముగూడ సంఘపాలకుఁడు ప్రభువు కులనాయకుఁ డను నర్థముల యందె వాడఁ బడినది. వైశ్య శూద్ర శబ్దము లొక్కచోటఁ దప్ప మఱెక్కడను ఋగ్వేదమునఁ గానరాకున్నవి. బ్రాహ్మణ క్షత్రి యాది చతుర్వర్ణ వ్యవస్థ

ఋగ్వేదకాలము కడపట నేర్పడినది గాని మొదట నుండియు నున్నది కాదు. వైది కార్యులలో మొదటి నుండియు వర్ణభేద మున్నట్లు కానరాదు. వృత్తి ప్రవర్త నాదులనుబట్టి వర్ణ భేద సూచక మైనయుత్తమ మధ్య మాధమ వివక్ష యించుక నడుమ వచ్చినది. కాని విద్యా వివేకాదులున్నచోట నదియును గణనీయ ముగా లేదు.

ఆర్ష సంప్రదాయమున బ్రహ్మర్షియని ప్రసిద్ధి కెక్కినవాఁడు దీర్ఘతముఁడు. ఇతఁడు పెక్కు సూక్తము లను బ్రచారము చేసెను. అందు తన వృత్తాంతము చెప్పుకొనెను (ఋ 1–140–161). ఇతఁడు అంగరాజు మహిషికడ దాసిగా నున్న ఉశిక్కు అనుదానియందు కక్షీవంతుఁ డనుసుతునిఁ గనెను. ఆబాలుఁడు బీజమును బట్టి దైర్ఘతమసుఁడు, ఆంగిరసుఁ డయ్యెను. క్షేత్రమును బట్టి యౌశిజుఁడు, దాసుఁడు నయ్యెను. అయినను రూప సంపన్నుఁడు విద్యాపూర్ణుఁ డునయిన యితనికి భావ యవ్య పుత్రుఁ డైన స్వనయుఁ డనురాజు తన కూఁతుల నిచ్చి పెండ్లి చేసెను (బృహ 3-143). సూక్త ద్రష్ట లయిన మహర్షులలో నొకఁడై విఖ్యాతి గాంచిన యితఁడు రచియించిన సూక్తములు ప్రథమ నవమ మండలములలోఁ గలవు (ఋ 1-116, 9-74).

కవషుఁ డను ఋషిచే ప్రోక్తము లైన సూక్తములు ఋగ్వేద దశమమండలమున నున్నవి (ఋ 10-30-34). అందు మొదటి సూక్తము 'అపోనప్త్రీయము' అను ప్రసిద్ధి గాంచినది. ఐతరేయ కౌషీతకి బ్రాహ్మణము లీతని వృత్తాంతము నిట్లు వర్ణించినవి. "ఋషు లందఱు కలిసి సరస్వతీ నదీ తీరమున సత్త్రయాగము చేయుచుండ నిలూషపుత్త్రుఁ డైన కవషుఁడు వచ్చి వారి మధ్యఁ గూర్చుండెను. వారతనినిఁ జూచి 'నీవు దాసీపుత్త్రుఁడవు, కితవుఁడవు, అబ్రాహ్మణుఁడవు మాలోనఁ గూర్చుండఁ దగవు' అని పలికి వానినిఁ దీసికొని పోయి నిర్జల స్థలమున విడిచిపుచ్చిరి. అతఁడు పిపాసార్దితుఁడై అబ్దేవతను (నీటిదేవత) బ్రార్థించుచు నొకసూక్తము రచియించెను. అదే 'అపోనప్త్రీయము'. ఆస్తుతికి సంతోషించి సరస్వతీనది యతఁ డున్నచోటు నకే ప్రవహించెను. అది చూచి ఋషు లాశ్చర్యపడిరి. అతని నిర్దోషివని తీసికొనివచ్చి తమలోఁ గూర్చుండఁ బెట్టుకొని అతనిమంత్రములతోడనే యాగము సాగించి 'త్వం వై నః శ్రేష్ఠోఽసి' నీవే మాకంటె గొప్పవాఁ డవని ఋషులెల్ల పొగడిరి". ఆకాలమున సంఘము కుల, గోత్ర, వ్రజ, గ్రామ, విశ, జనములు అనుభేదముల విభజింపఁ బడియుండెను. ఋగ్వేద

కాలము పిమ్మటఁ గూడ సామ వేద తాండ్య బ్రాహ్మణ మున వ్రాత్యస్తోమమను యజ్ఞమువలన ఇతరజాతులు బ్రాహ్మణు లైరి.

ఆకాలమున సంఘమున తరగతులే కాని జాతి భేదము లేదు. భోజన ప్రతిభోజనము నెడ ఆర్యజాతిలో విభేదము లేదు. శూద్రులు బ్రాహ్మణులైరి, బ్రాహ్మణులు శూద్రులైరి. 'శూద్రో బ్రాహ్మణతా మేతి బ్రాహ్మణ శ్చైతి శూద్రతాం' మను. . ఉత్తమజాతులు అధమజాతులు అధమజాతులు ఉత్తమజాతులుగా యోగ్యా యోగ్య వర్తనములఁబట్టి మాఱుచుందురు. (ఆపస్తంబసూత్రము.)

యాదవులు క్షత్రియులయ్యు వైదికకర్మము విడుచుటచే శూద్రులుగా భావింపఁబడి పిమ్మట క్షత్రియు లైరి. విశ్వామిత్రుఁడు, దేవాపియు క్షత్రియులయ్యును పురోహితులుగా నుండి యజ్ఞాదులు చేయించుచు వచ్చిరి. భృగుమహర్షి వంశస్థులు రథకారకులైరి. ధార్ష్ట్రవంశస్థులు క్షత్రియులయ్యును బ్రాహ్మణు లైరి (భాగవతము). గార్గ్యుడు త్రయ్యారుణి, కవి, పుష్కరారుణి, క్షత్రియులయ్యును బ్రాహ్మణులయిరి. భారద్వాజుఁడు బ్రాహ్మణపుత్రుఁడయ్యు క్షత్రియుఁడగు భరతునిచేఁ బెంచుకొనఁబడెను. 'నాభాగారిష్ట పుత్రౌ ద్వౌ

వైశ్యౌ బ్రాహ్మణతాం గతౌ' (హరివం). నాభాగారిష్ట పుత్రులు వైశ్యులయ్యును బ్రాహ్మణత్వము నొందిరి.

పూర్వకాలమునందువలెనె నేటికాలముననను వివిధజాతులయందు జ్ఞానసంపన్నులగుయోగులున్నారు. వారినిగాంచి కొందఱు 'అభిప్రాయములయందును, అనుష్ఠానములయందును, వృత్తులయందును వేఱు వేఱు మార్గములను ద్రొక్కుచున్నారు. విద్యాధికమండలి వారి వాదప్రతివాదములు పాశ్చాత్యుల మీమాంస ననుసరించియే జరుగుచున్నవి' అని యనుచున్నారు. అదిపొరపాటు. మన పండితవర్గము వారి ధర్మానుష్ఠాన ములు గతానుగతికములుగానున్నవి. ఆదరించు ప్రభువులు, కలియుగము కారణములు కాజాలవు. వారి చుట్టు నున్న స్థితిగతులు, దేశకాలములు, వారిధర్మములకును, వారియనుష్ఠానములకును అనుకూలములు కావు. ఏజీవి యైనను ప్రతికూలమగు దేశకాలములకు లోపడినప్పుడు ఆజీవి నశింపక తప్పదు. దేశముయొక్క ధర్మము మనము కాపాడుకొనలేని స్థితియందున్నప్పుడు మనపాండిత్యము మనశాస్త్రములు ఎందుకు? దేశకాలములను బరిపాలింపఁ గలిగినది ధర్మము గాని, దేశకాలములచేఁ బరిపాలింపఁబడుట ధర్మముకాదు. కాలమునకు వశపడుచుండినవానికిఁ గాలము స్వధర్మము

నకు సహాయభూతమగును. దానికి లోపడు వాని నది భక్షించును. యుగధర్మ మనఁగా ఆయుగమును, ఆకాలమును, వశపఱచుకొనఁ గలిగినది. అంతియె కాని ప్రారబ్ధమునకు లోపడుట కాదు.

ధర్మము బహిర్వ్యస్తువైనచో నది పరిస్థితులఁ జిక్కి యంతరించును. 'ధర్మస్య తత్వం నిహితం గుహాయాం'. ధర్మతత్త్వముబుద్ధియం దంతర్గతమై యున్నది. బుద్ధి మందగించి నప్పుడు ధర్మముక్షీణించును. బుద్ధి తీక్ష్ణ మైనప్పుడుధర్మము వికసించును. దేశ కాల పాత్రముల గుర్తెఱింగి ధర్మ నిరూపణము చేయఁ గలిగిన దే బుద్ధి. మనము బుద్ధిని గోల్పోయి, జడులమై, కాలమును, దేశమును దూషించుచున్నాము. దేశకాలములను శాసింప లేనివి శాస్త్రములుకావు. అవి గ్రంథములు కావచ్చును. తాళపత్రములు కావచ్చును. కాని ధర్మమును నిర్వహింపఁగల సాధనములు గావు. పండితులకుఁ దాము నేర్చుకొనిన శాస్త్రములయందు సంశయమే లేనప్పుడు విచార మెక్కడ? సందేహము వలన జిజ్ఞాస, జిజ్ఞాసనుండీ పరీక్ష, పరీక్షవలన ఏకాగ్రత, దానివలన నిశ్చయజ్ఞానము, దానివలన దుష్ట సంస్కార వర్జన సాహసము, దానివలన ధర్మప్రతిష్ఠ యేర్పడును. ధర్మపరీక్షయం దుండవలసిన శాస్త్రము,

సందేహము, విచారము, సంగతి, సమన్వయము, మనపండితుల యందెంత మాత్రమును లేవు. పూర్వము మన ధర్మప్రవర్తకు లిట్టి నిస్సహాయత్వమునకును, నైచ్యమునకును, బాల్పడి యెఱుంగరు. వారిపాండిత్యము, వారినిష్ఠ, ఏకాలమునకుఁ దగినట్లు ఆకాలమునకు ధర్మశాస్త్రములు సృష్టింపఁ గలిగెను; మార్పఁ గలిగెను. సంస్కరింపఁ గలిగెను. ఎప్పుడును వారు కాలమునకుఁ బ్రభువులైరి; కాని దాసులై యెఱుఁగరు. బౌద్ధధర్మము, భారతవర్షమును నిరీశ్వర వాదమునఁ బడఁద్రోయుచున్నపుడు శంకరుఁడు కలి మహిమ యని నిస్సహాయత్వమును వెలిఁ బుచ్చలేదు.

బాలుఁడయ్యును శంకరుఁడు పెద్ద ధర్మగ్రంథముల నెల్ల నామూలాగ్రముగఁ బఠించి, బౌద్ధుల తర్కములతోడనే బౌద్ధ ధర్మములను ఖండించి అద్వైత సంస్థాపనాచార్యుఁ డయ్యెను. రామానుజాచార్యులు తనపాండిత్యమును బోషింపఁగల రాజుల ప్రాపు గొనకయే వైష్ణవ సంప్రదాయమును స్థాపించెను. నూతన శాస్త్రములను, నూతనసాహిత్యమును, నూతనధర్మమును, నిర్మింపఁగల, ఆత్మప్రతిభయు, తపఃప్రభావమును, మనపండితులలో బొత్తిగా నశించినవి. వారు తర్కము చదువు కొనుచున్నారు. కాని ఆతర్కములో నూతన

సిద్ధాంతములను కనిపెట్ట లేకున్నారు. పూర్వమీమాంస కావశ్యక మైన కర్మజిజ్ఞాస లేనప్పుడు ఉత్తరమీమాంస బోధించు బ్రహ్మజిజ్ఞాస యెట్లు సాధింపఁగలరు ? నిత్యానిత్య వస్తు వివేకమునకు చిత్తశుద్ధి మూలము. అదిలేక ధర్మానుష్ఠానము సాధ్యము కాదు. ధర్మానుష్ఠానము లేనిది బ్రహ్మ సాక్షాత్కారము అసంభవము. పండితులు శ్రవణముతోఁ దృప్తి నొందుచున్నారు. వారి జ్ఞానము శ్రుతజ్ఞానము. వారియనుష్ఠానము కేవలము గతానుగతికము. ఉన్నది యున్నట్టులే యుండవలయును. మార్పుకూడదు. ఉన్నది మంచిది. ప్రాఁతది మంచిది. మామూలుది మంచిది. క్రొత్తదియనిన మార్పనిన సహింపరు. భూతకాలము వారిపాలిటి ధ్రువనక్షత్రము. శాస్త్రములు వారికి సంకెల లైనవి. మనఋషులు ఆరణ్యకములను గానము చేసినప్పుడు తర్కములు లేవు, శాస్త్రములు లేవు, వ్యాఖ్యానములు లేవు, లక్షణగ్రంథములు లేవు, వ్యాకరణములు లేవు. సర్వమును వారు తమ అతీంద్రియ దృష్టిచే తమజ్ఞాన సంపత్తిచే సృష్టింపఁ గలిగిరి. సంస్కరింపఁ గలిగిరి. వారు ధర్మనిర్ణయమునకుఁ బరులపై ఆధారపడి యుండలేదు. వారు తమ ఆత్మప్రత్యయము మీఁదనే ఆధారపడి యుండిరి. కావుననే వారు మంత్ర ద్రష్టలైరి.

శాస్త్రము మనకొఱకో, మనము శాస్త్రములకొఱకో యనువిషయమును మఱువరాదు.

ఇల్లు దాఁటినఁ గాని యింటియొక్క హద్దులును, ఇంటియొక్క సంప్రదాయములును తెలియవు. అల్పపండితులు తమశాస్త్రముల నతిక్రమింప లేక పోవుటచే తమశాస్త్రములహద్దులను గౌరవమును తెలిసికొన లేకున్నారు. పరధర్మమును తెలిసికొనక ధర్మమును కాపాడుకొనుట యసంభవము. ధర్మరక్షణమునకుఁ బూనుకొనుటకు సాహస మున్నచో విశ్వమునంత నొక్కమాఱు పరికించి, ఏయే దేశములు ఎట్లు క్రమవికాసము నొందుచున్నవో పరికింప వలయును. ధర్మజిజ్ఞాస నశించి ధర్మశాస్త్రములు గ్రంథముల రూపమున శేషించినవి. కేవలము గతానుగతికము, అనుకరణము, మర్కటధర్మము; కానిమానవధర్మముకాదు. ఎవఁడు ప్రకృతిని తనచిత్తాను సారముగ సంహరించి సృష్టింపఁ గలఁడో వాఁడే జితేంద్రియుఁడు, యోగి, జ్ఞాని, బ్రహ్మానందసంధాత.

ఘన గిరి పురదాతా ! కమ్రగాథాతి పూతా !
ధనద సమ ధనాఢ్యా ! తత్త్వధీభిన్నమౌఢ్యా !
కనకతనువిభాసీ ! కావ్య మాలావికాసీ !
వినయ సుగుణధామా ! వేంకటాఖ్యాభిరామా !

శ్రీగీర్వాణాచ్ఛా సమ
వాగమృత రస ప్రబంధ బంధురతర భా
షాగమ భూమీధర వర
రాగస్న స్థల పతత్రి! రామయశాస్త్రీ!
దివ్యచిత్తంబున అవధరింపుము.

## తపోభూమి

### వేదాధ్యయనము

అజ్ఞానాంధకారపూరితమై, దారిద్ర్యభూయిష్ఠమై, ఐకమత్యవిహీనమై, ఆత్మగౌరవశూన్యమై, స్వేచ్ఛారహితమై ఆర్యావర్తము అధోగతియందున్న యిక్కాలమున వేదవిద్యా వ్యాపనముచేసి జ్ఞానము వెదచల్లుటకుఁ బరమ సాధన భూత మైనదే తపోభూమి. అభిప్రాయభేదముల కెడమిచ్చు ప్రత్యేక మతోద్దేశములను గాని సాంఘికాభిప్రాయములను గాని వ్యాపింపఁ జేయుటకు ఏర్పడనందునను, సమిష్టి జ్ఞానార్జనమే యుద్దేశముగాఁ గలది కావునను తపోభూమి పరమపవిత్రమై కైవల్యాశ్రమ మైనది. జాతి మత వివక్ష లేక మానవమాత్రుల కెల్ల నీ భూమి ఆశ్రయ మైనది.

'విద్యయామృత మశ్నుతే' (యజు అ4). దేనిమూలమునఁ బరమ సౌఖ్యము ప్రాప్తమగునో యదియే విద్య 'వేత్తి యయా సా విద్యా' (విద్ జ్ఞానే) దేనిమూలమున యథార్థజ్ఞానము గలుగునో యదియే

విద్య. సమస్త సౌఖ్యములకు నివాసస్థానమగు సీమకుఁ జేర్చునదియే విద్య. 'విద్యయా విందతేఽమృతమ్'. విద్య వలనఁ బరమానందము సంప్రాప్తమగును.

'మాతేవ రక్షతి పితేవ హితే నియుంక్తే
కాంతేవ చాభిరమయ త్యపనీయ ఖేదమ్
కీర్తించ దిక్షు వితనోతి తనోతి లక్ష్మీం
కిం కిం నసాధయతి కల్పలతేవ విద్యా' (భోజ ప్ర.)

తల్లి కుమారు నేప్రకారముగఁ బోషించి రక్షించునో యదే ప్రకారము విద్య మానవునిఁ గాపాడును. తల్లి మానవుని బాల్యావస్థయందు మాత్రమే రక్షించును. కాని విద్య సకలావస్థలయందును రక్షించును. తండ్రి కుమారు నెట్లు హితమందు వర్తించునట్లు చేయునో యట్టులే విద్యయు మనుజునకు హితాహితంబులజ్ఞానము నొసంగి హితమందుఁ బ్రవృత్తుఁడగునట్లు చేయును. పతిహితవ్రత యగుకాంత నిజకాంతున కెట్లు దుఃఖ మనుమాట కలుగనీయక ఎల్లవిధముల సౌఖ్యము సమకూర్చుచుండునో అట్టులే విద్యయు మనుష్యునకు సర్వవిధముల సౌఖ్యము కలుగజేయుచు దుఃఖములనుండి తప్పించుచుండును. విద్యయను కల్పలతవలనఁ బ్రాప్యము కానేరని పదార్థమేమియుఁ బ్రపంచమున లేదు. సమస్తపంచేంద్రియములకు వాలఁ

గించి కంటికగపడని పరోక్ష బ్రహ్మపదార్థజ్ఞానమును గలుగఁ జేయుటచే జగత్తున కంతకు నేత్రమనం దగు విద్య యెవనికి లేదో వాఁడే యంధుఁడు. కావుననే

'నాస్తి విద్యా సమం చక్షుః'

అని శాస్త్రములు వాకొనుచున్నవి.

'సర్వేషా మేవ దానానాం బ్రహ్మదానం పరం స్మృతమ్'.

దానములకెల్ల బ్రహ్మదానము ఉత్కృష్ట మైనది. బ్రహ్మదానము చేయువాఁడు ఉత్కృష్టుఁడు. బ్రహ్మ (వేద) దానము పొందుటకు మానవమాత్రు లందఱును అర్హులు. అనర్హు లెవ్వరును లేరు.

'అధర్వణస్య వేదస్య శేష ఇ త్యుపదిశన్తి'.

స్త్రీశూద్రులకుఁ గూడ విద్యాధ్యయ నాధికార మున్నది. వారిచే అధర్వవేదము చదివించవలయును (ఆ. ధ. సూ.)

'య థేమాం వాచం కళ్యాణీ మావదాని
జనేభ్యః బ్రహ్మ రాజన్యాభ్యాగ్ం
శూద్రాయ చార్యాయ స్వాయ చారణాయ'
యజు. (అ 26, 2 మంత్రము.)

విద్వాంసులారా! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్ర, అతిశూద్ర, అంత్యజాతి, సమస్త మానవ

మాత్రుల నిమిత్తము నే నెట్లు వేదమును బ్రకాశము చేసియున్నాఁడనో యట్టులే మీరును జేయుఁ డని పరమేశ్వరుఁడే యాజ్ఞాపించియున్నందున మనుష్యమాత్రునకు నెల్ల వేదాధ్యయ నాధికారము కలదని స్పష్ట మగుచున్నది.

ఐతరేయ బ్రాహ్మణమునందలి అగ్నిష్టోమ ప్రకరణమున బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రాదులు క్రమముగా తొమ్మిది, పదునైదు, పదునేడు, ఇరువది యొక్కటి, అగ్నిష్టోమములతోడ (వేదమంత్రములు) యజ్ఞము చేయవలయునను నియమ ముండుటవలన శూద్రులుకూడ యజ్ఞముచేయవలయు నని విధింపఁబడి యుండుటచే వారికి వేదాధ్యయ నాధికారముండుట నిస్సందేహము. రయికుఁ డనుమహర్షి జాంశుతి యను పేరుగల శూద్రునిచే విద్యచదివించెను. కులము తెలియని జాబాలికి గౌతమఋషి ఉపనయన సంస్కారముచేసి విద్య నేర్పెను. (ఛాందో) కతషమైలుషుఁ డను (శూద్ర) ఋషి ఋగ్వేదమందలి పదవ మం—౩ అనువాకము లోని ముప్పై ముప్పైనాలుగు సూక్తములను బ్రచారముగావించి యనేకఋషులచేఁ జదివించెను. (ఐతరేయ బ్రా. 2-౩ అ. కౌశీ బ్రా.) కక్షవానుఁడు అంగ దేశము రాజుయొక్క దాసికుమారుఁడు ఋగ్వేదమందలి

1 మం. 17 అను. 116—126 సూక్తములను బ్రచారము చేసెను.

శతపథమునందును, ఆపస్తంబ శ్రౌత సూత్రములందును, గోబిలీయ సూత్రములందును, కొన్ని మంత్రములతో నాలుగువర్ణములవారు యజ్ఞ విధానమున హావిస్సును శుద్ధిపఱచవలయు ననియుఁ గొన్నిమంత్రములు మంగలికి (గోభి. 4 ప్ర. కం 1) వినిపింపవలయు ననియుఁ గొన్నియజ్ఞములు సమస్తనిషాదులచేఁ జేయింపవలయు ననియు విధింపఁబడుటచేత శూద్రులకు వేదాధికారము సిద్ధమగుచున్నది. మనుష్యమాత్రులకు శాస్త్రాధికారము, యజ్ఞాధికారము ఉన్నటుల 'ఫలార్థతత్వాత్ కర్మణః శాస్త్రం సార్వాధికారం స్యాత్' అని జైమిని పూర్వమీమాంస. (6 అ. పా)

యజ్ఞసంబంధము లైనసమస్తకర్మములు ,వేదములు చదివినవారేచేయవలయునుగాని యితరులుచేయఁగూడదు. వేదాధ్యయనము సకలజనులకుఁ గర్తవ్యంబు. 'శ్రావయే చ్చతురో వర్ణాన్ కృత్వా బ్రాహ్మణ మగ్రతః వేద స్యాధ్యయనం హీదం తచ్చ కార్యం మహాత్మస్మృతం'
భార. శాం 328 అ

'శూద్రాణా మదుష్టకర్మాణా ముపనయనమ్'
(పరా. స్మృ. సూ 2 కాం ప్ర 6)

దుష్కర్మరతుండగు బ్రాహ్మణునకు సయితము ఉపనయన సంస్కారము లేదు.

'సత్య మహాం గభీరః కావ్యేన
సత్యం జాతే నాస్మి జాత వేదా న
మే దాసో న మే ఆర్యో మహిత్వా
వ్రతం మీమాయ య దహాధరిష్యే'

అథ. 8 కు, 2 అ, 11 వ.

"మనుష్యుఁడా ! పరమేశ్వరుఁడ నగు నేను సత్యస్వరూపుఁడనై, మహాగంభీరుఁడనై, సత్యమగు వేదవిద్యను, ప్రకటనచేయుటచేత జాతవేదుఁడనై యున్నాను. నేను ఏదాసునకుఁగాని యేఆర్యునకుఁగాని పక్షపాతము చేయఁజాలను. ఎవరు నాయొక్కన్యాయాచరణములను సత్యవ్రతాజ్ఞలను బాలింతురో, అట్టివారి నుద్ధరణముచేయుదును." దీనింబట్టి వేదాధ్యయన యజ్ఞకరణార్హతలు మానవమాత్రులకుఁ గలవనుట నిక్కువము.

స్త్రీశూద్రులకును శబ్దముల నుచ్చరించునిమిత్తము నాలుకను, అక్షరావలోకనమునకుఁ గన్నులను, వ్రాయుటకు హస్తములను, విచారించుకొనబుద్ధిని, మననముసేయుటకు మనస్సును, స్మరించుటకు స్మృతిని పరమేశ్వరుఁ డొసఁగియున్నాఁడు. విద్యాధికారము మానవునియొక్క విద్యాభ్యాసము, బుద్ధి

మొదలగువానిపై ఆధారపడియుండును. ఎవరి కత్యు త్తమం బగుబుద్ధియుండునో, ఎవఁడుచదివించుటచేతఁ జదుననోపునో యట్టివానికి విద్యయెడల సంపూర్ణాధి కారము గలదు.

క్షత్రియుఁ డైనమాంధాత, వైశ్యుఁ డైనతులా ధారుఁడు వేదప్రచారకులై బ్రాహ్మణులకు శిక్ష యొసంగిరి.

విదురుఁడు ధృతరాష్ట్రునకు, సూతుఁడు ఎనిమిది వేల యెనిమిది వందలమంది శౌనకాదులకు, ధర్మవ్యా ధుఁడు కౌశికఋషికిఁ దత్త్వోపదేశముచేసి యున్నారు.

భక్తిజ్ఞాన వైరాగ్యములు నేర్చిననాఁడు ఎల్ల రును అగ్రద్విజులై ఈశ్వరానుగ్రహమునకు మోక్షము నకుఁ బాత్రులగుదురు. రామానుజులవా రీసిద్ధాంత మును వహించియె యెందఱినో సముద్ధరించిరి.

చతుర్థజాతివారు వేదములు చదువరాదనుట యును సమంత్రకముగా యజ్ఞములు చేయరాదనుటయుఁ గేవలము శిష్టా (ఛాందసా) చారము తప్ప వేఱొండు కారణము కానరాదు. ఈస్థితిలో స్నానము క్షౌరము, దానము, జందెముయొక్క సవ్యాపసవ్యములు వాని వలన వారు పవిత్రులు కాఁగలరు.

గుప్తసిద్ధాంతము, తేజస్సు. చతుర్థకులజులందఱు దుష్టులు కాకపోవుటచేతను, బ్రాహ్మణు లందఱు సత్పురుషులు కాకపోవుటచేతను, ఈసిద్ధాంతము నిలువఁజాలదు. చెప్పులను కుట్టురోహిదాసుఁడు, మంగలివాఁడగు సేనుఁడు అగ్రవర్ణములవారిచేఁ బూజింపఁబడిరి.

ప్రాచీ నార్యులు తమచే జయింపఁబడిన అనార్యులతో స్వేచ్ఛగఁ గలిసి తిరుగుచుండెడివారు. వారినిఁ దమజాతిలోనికి స్వీకరించుచుండిరి. అందఱకు సమానావకాశము లొసంగి పిమ్మటఁ దగినవారినిఁ బైవర్ణములలోఁ బ్రవేశపెట్టు చుండెడివారు. అదియే వర్ణాశ్రమ ధర్మము. గుణకర్మములఁబట్టియే యానాఁడు వర్ణములు ఏర్పడెను. కావుననే 'చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణ కర్మ విభాగశః' అని శ్రీకృష్ణ పరమాత్మ నుడివినాఁడు.

ప్రాయశ్చిత్తసిద్ధాంతము:—ఈసిద్ధాంతము ప్రతి వ్యక్తికిఁ బ్రత్యేకముగా సమన్వయించును గాని సంఘమంతకు వర్తింపఁ జాలదు. అందుచే భ్రష్టుఁ డగువాఁడు వ్యక్తిగాని సంఘముకాదు. పూర్వకాలమున భ్రష్టుఁడగు వాఁడు ప్రాయశ్చిత్త మొనరించుకొని తిరిగి స్వధర్మము నవలంబించుట కర్హత కలిగి యుండెను. అందుచే భ్రష్టత నిత్యము కాదు. తాత్కాలికము. ఈవిధి ననుసరించియే అనే కానార్యులు ఆర్యు లగుచుండిరి. అందు

లకు బ్రాహ్మణములు, ఉపనిషత్తులు పురాణములు పరమ ప్రమాణములు. ఈసమయమునందు ఆచరణయం దుండి విధింపఁబడిన నియమములు ప్రారంభమున మిక్కిలి తక్కువగను, స్పష్టముగను, సులభసాధ్యము గను నుండెను. పిమ్మటఁ గ్లిష్టము లయ్యెను. తుదకు నశించి జన్మచేతనే జాతి ధర్మము నిర్ణయింపఁ బడు నంతటి యవస్థకు వచ్చెను. వైదికధర్మము తిరిగి దేశ మునందుఁ దలయెత్తవలయునేని సాంఘిక కర్మలయందు మతవిషయములందును, సర్వమానవులకు సమాన స్వాతంత్ర్యము నొందుటకై ప్రాయశ్చిత్తము సంస్కా-రము, ఉపనయనము, వేదాధ్యయనము తపోయజ్ఞకర ణము మొదలగునవి ఆచరింపఁబడ వలయును.

గణికా గర్భ సంభూతుఁ డైనవసిష్ఠుఁడు మాలె తను బెండ్లియాడి బ్రాహ్మణత్వమును గాంచెను. (గణికా గర్భ సంభూతో వసిష్ఠశ్చ మహాఋషిః. భార.) బ్రాహ్మణ కుల పతియాయెను.

ఆది కవీంద్రచంద్రుఁ డైనవాల్మీకి నిషాదుఁ డయ్యును బ్రాహ్మణత్వమును గాంచెను.

వేదవిభాగము చేసి అష్టాదశ పురాణకర్తయై పంచమవేదమును రచించిన వ్యాసుఁడును, వ్యాసులఁ

గన్న పరాశరుఁడును కైవర్త (పల్లె) శ్వపాక (మాల) కాంతలకుఁ బుట్టి బ్రాహ్మణులైరి.

'జాతో వ్యాసస్తు కైవర్త్యాః, శ్వపాక్యాస్తు పరాశరః
శ్వపాకీ గర్భసంభూతో పితా వ్యాసస్య సత్తమః'

భా. న. భవిష్య:

వేదవ్యాసులవలన వేశ్యకుఁ బుట్టి శుకుఁడు బ్రాహ్మణత్వమునొంది తత్వవేత్త యయ్యెను. (దేవీ భాగవతము.)

సత్యకాముఁ డనుజాతిహీనునకు గౌతముఁడు బ్రాహ్మణత్వమిచ్చెను (ఛాందో 4 ఖం.)

వ్యదకర్మఁ డనుప్పుల్కసుఁడును, అధమజాతి వాఁడయిన ఉలోపియు బ్రాహ్మణులైరి.

క్షత్రియులయిన రంతిదేవుని వంశమువారు బ్రాహ్మణులై ముద్గలగోత్రమువారై నేఁటికిని పేరు ప్రతిష్ఠలతో వెలయుచున్నారు (భాగ నవ స్కం.)

వీతహవ్యుఁడు, యువనాశ్వుఁడ క్షత్రియులయ్యు బ్రాహ్మణులైరి. మందపాలుఁ డనుఋషి నికృష్టజాతి కన్యయగు సారంగిని పెండ్లి యాడెను 'సారంగీ మందపాలేన జగామాభ్యర్హణీయతాం' (మ) కర్ణముని మిశ్ర దేశమునకుఁ బోయి పదివేలమంది మ్లేచ్ఛులను ద్విజులుగఁ జేసెనని భవిష్యత్పురాణము ప్రతిసర్గపర్వము

నాల్గవఖండము ఇరువది తొమ్మిదవ సర్గములోని పదు నాఱవశ్లోకము మొదలుకొని ఇరువదితొమ్మిది వఱకుఁ గల శ్లోకములు వచించు చున్నవి.

పరశురాముఁడు కొంకణతీరమందు నివసించు చున్న పల్లెజాతి నంతను చిత్పవనబ్రాహ్మణులుగా మార్చె నని స్కాందపురాణములోని సహ్యాద్రిఖండము వర్ణించుచున్నది.

అబ్రాహ్మణ్యే తదా దేశే,
దేశైకై వర్తా న్ప్రేక్ష్య భార్గవః
యజ్ఞసూత్రమ కల్పయత్
స్థాప యిత్వా స్వకీయేస క్షేత్రే విప్రాన్ ప్రకల్పితాన్.

యజ్ఞములయందు సర్వవర్ణములవారు సపంక్తి భోజనముచేయువారు. వర్ణభేదము పాటింపక కౌశికుఁడు ధర్మవ్యాధునొద్ద జ్ఞానోపదేశము నొందెను.

యుధిష్ఠిరమహారాజు గృహమున శతసహస్ర సంఖ్యగల దాసీలు వచ్చిన యతిథులకు నెల్ల హస్తము లతోఁ గుడలను గైకొని అహోరాత్రములు విరామము లేకుండ భోజనాదులు పెట్టి రని విరాటపర్వము వాకొనుచున్నది. ప్రారంభమున బ్రాహ్మణులకు సైతము శూద్రులే పాచకులు. కావుననే 'ఆర్యాధిష్ఠితా వా, శూద్రాః సంస్కర్తారః స్యుః' అపస్తంబసూత్రము.

ఆర్యులు యజమానులు, శూద్రులు పాచకులు. చతుర్వర్ణముల వారికి భోజన ప్రతిభోజనములయందు విధి నిషేధము లేదు. అదే యార్షకాలపు ఆర్యనీతి, ఆచారము; ధర్మము. ఏవర్ణమునవాఁడైనను సరే తన జ్ఞానసంపత్తిచే బ్రహ్మత్వము నొందుటకు అర్హుఁడు. తా నర్హుఁడై తనజాతిని మానవజాతిని సముద్ధరించి మోక్షమార్గమునకుఁ గొని పోవువాఁడే నిజమైన బ్రహ్మర్షి.

రసికజన వరేణ్యా! ప్రాజ్ఞలోకాగ్రగణ్యా!
అసదృశ శమశాలీ! యక్షర కీర్తిమాలీ!
అసమశర నిభాంగా! ఆంధ్రక వ్యబ్జ భృంగా!
ఘుసృణ రుచిర రాగా! కోవిద స్తుత్య యోగా!

శ్రీరంగనాథభక్తా !
దూరీకృత పాపనిచయ దౌర్గ్ధ్య సుసక్తా !
సా. రామృ తాన్న భోక్తా !
రారాజ న్నాకలోకరమణీ రక్తా !
దివ్యచిత్తంబున అవధరింపుము.

# తపోభూమి

## బ్రహ్మచర్యము

మానవుఁడు వైదికమార్గమున బ్రహ్మత్వము పొంది బ్రహ్మానందపదవిఁ గాంచఁగోరిన బ్రహ్మచర్య వ్రతావలంబన మవశ్యకర్తవ్యంబు. పారమార్థిక సౌఖ్యములకు ముఖ్యకారణము బ్రహ్మచర్యము.

'బ్రహ్మణే వేదాది విద్యాయై చర్యతే ఇతి బ్రహ్మచర్యమ్'

వేదవిద్య బ్రహ్మ యనఁబడును. ఆవిద్యల నేర్చుకొనుటకొఱకుఁ బూనునట్టి యాచరణము బ్రహ్మచర్యము. ఆనియమము ననుష్ఠించువాఁడు బ్రహ్మచారి.

'బ్రహ్మణి చరితుం శీల మస్యా స్తీతి బ్రహ్మచారీ;
బ్రహ్మ వేద స్తదధ్యయనార్థం యద్వ్రతం తదపి బ్రహ్మ;
తచ్చర తీతి బ్రహ్మచారీ.'

వేదవిద్యను బొందుటకుఁ దగిన శీల మెవనియందుండునో వాఁడు బ్రహ్మచారి. వేదవిద్య నభ్యసించు నిమిత్తము అవలంబింపఁబడు జితేంద్రియాదినియమములకుఁగూడ బ్రహ్మయని పేరుకలదు. కావున ఆనియమములు దాల్చువాఁడును బ్రహ్మచారి.

సమస్త సౌఖ్యములప్రాప్తికి హేతువు జీవనము. ఆజీవనమునకు ముఖ్యహేతువు ప్రాణరక్షణము. ఆప్రాణ రక్షణమునకు ముఖ్యసాధనము బ్రహ్మచర్యము. బ్రహ్మచర్యమువలన ఉభయలోక సౌఖ్యములు కలుగును.

బ్రహ్మచర్యమువలన జీర్ణశక్తి వృద్ధియగును. అస్ఖలిత బ్రహ్మచర్యమువలన మానవుఁడు అస్వప్నుఁడగును. స్వప్నరహితునకు భయము కలుగదు. అతని ధారణ ధ్యానములు పవిత్రములగును. దాన దివ్యజ్ఞానమలవడును. తన్మూలమున దూరదృష్టి దూరశ్రవణము మొదలగుసిద్ధులు గలుగును.

'పుణ్యాతమ మాయుః ప్రకర్షకరం జరా వ్యాధి ప్రశమనం ఊర్జస్కర మమృతం శివం శరణ్యా ముదాత్తం మత్తః శ్రోతు మర్హామధోప ధారయితుం ప్రకాశయితుం చ ప్రజానుగ్రహార్థ మార్షం బ్రహ్మచర్యం'

చర. చి. 1 అ రసా 4.

తపోధను లైనబుషులారా! సకల మానవులకుఁ బుణ్యము లన్నిటికంటె నుత్తమ పుణ్యా మగునదియు, సంపూర్ణ మగునాయువు నొసఁగునదియు ముసలితనము శీఘ్రముగా రానీయనిదియు రోగముల నాశనము చేయునదియు, తేజము నభివృద్ధి పఱచునదియు, అకాలమృత్యువునుండి తప్పించునదియుఁ,

గళ్యాణ మొనఁగూర్చునదియు, శరీరాదులను రక్షించు నదియు, మనస్సు నెల్లవేళల ఆనందమున నిలుపు నదియు నగు బ్రహ్మచర్యమును మీరు నావలనఁ దెలిసి కొని యవలంబింపుఁడు. సనాతన మైనయీనియమమును జనుల కందఱకును సౌఖ్యము కలుగునిమిత్తము జగమునఁ బ్రచారము చేయుఁడు.' అని భృగు, అంగిరస, అత్రి మున్నగు మహర్షులతోడ ఇంద్రుఁడు వచించి యుండెను.

పూర్వకాలమునందుమనయార్యావర్తమునందలి ఋషులు మహర్షులు మొదలగు వారెల్లరు గృహస్థులుగా నున్నను బ్రహ్మచర్యవ్రతమును జక్కఁగఁబాలించుటచేతనే మనదేశము సమస్తవిధముల మహోన్నత దశలో నుండెను. కాని యెప్పుడు దానికి భంగము వాటిల్లెనో యప్పుడే దేశమును భ్రష్టమయ్యెను. ఆ నియమపాలనమువలననే లోక. లోకాంతరములుగూడ జయించిరి. (అర్జునుఁడుగంధర్వుఁడు) ఈవ్రతమువలన జలును విగతతంద్రులై (మత్తు) పాపాచరణదూరులై రోగ, దుఃఖ, సందేహరహితులై సమాధిస్థ శుద్ధాంతఃకరణులై పురుషార్థులు, బుద్ధిమంతులు స్మృతిమంతులు, బలవంతులు నగుదురు. క్రియా కుశలత్వమున వివిధములై నసౌఖ్యము లనుభవించుటకును, ధర్మ తపో

శ్రీకాంతాశ్రిత ధామా !
ప్రాకట సుకవీంద్రచంద్ర భాగ్యస్తోమా !
లోకాయతాంధ భామా !
రాకేందు యశోఽచ్ఛ సీమ రామయనామా !
దివ్యచిత్తంబున అవధరింపుము.

## తపోభూమి

### యోగము

మనుజుఁడు కర్మ జ్ఞాన భక్తిమార్గములందు దేనిం బూని చనినను మోక్షద్వారముం జేరఁగలుగును. మార్గములు వేఱు వేఱైనను తుదకుఁ జెందవలసిన చోటొక్కటియే. ఏమార్గమున నచ్చోటుఁ జేరినను దక్కిన రెండుమార్గములసారము గ్రహించి పూర్ణత్వముం గాంచిన యనంతరంబ మోక్షపదవిం బ్రవేశించును. ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, యని జీవుని యందు మూఁడుశక్తు లమరియుండును. ప్రథమంబున నియ్యవి బహిర్వ్యాపకంబులు గాక కారణరూపంబులై లోపల నణఁగి యుండును. చిరకాలాభ్యాసమున నిమ్మూఁడును గొంచెము కొంచెముగ బహిర్గతములై పరిపూర్ణత నొంద జీవుఁడు ముక్తిం గాంచును. కర్మ మార్గమునఁ గ్రియాశక్తియు, జ్ఞానమార్గమున జ్ఞాన శక్తియు, భక్తిమార్గమున ఇచ్ఛాశక్తియుఁ దొలుత వికాసంబు నొందును. ప్రతిమార్గాంతమునఁ దక్కిన శక్తులు రెండును, బరిపక్వము కాఁగా జీవుఁడు సర్వశక్తి పరిపూర్ణుఁడై ముక్తుఁ డగును.

ఈమూఁడు మార్గముల ననుష్ఠింపఁ దగిన సాధ నములందుఁ గొన్ని భేదములు గలవు. కర్మాచరణము భగవంతునితోఁడ సంయోగము ఘటింపఁ జేయుమార్గ మగుటచే నియ్యది కర్మయోగ మని పేర్కొనఁబడియె. కర్మ మనఁగా వ్యాపారము. కర్మము నొనరించుటకు మనుష్యునకు శరీరము, వాక్కు, మనస్సు అనునవి కర ణములు (సాధనములు). ఇవియే త్రికరణములు. వీనిలో నెద్దానితోఁ జేసినను కర్మయగును. ప్రతిమను జుఁడును, ఎడ తెగక నిరంతర మెద్దియైన నొక కార్యముఁ జేయుచుండునే కాని వ్యాపారశూన్యముగ నొక్కనిమిష మైననుండ నోపఁడు. 'నహికశ్చిత్ ......' జీవునకు జ్ఞానావిర్భావ ప్రథమావస్థలో మనోవ్యాపారము మిగుల సకృత్తుగా నుండును. శారీరక వాచిక కార్య ములసయితము అతిస్వల్పముగను, దుర్బలముగను నుండును. ఇవితమోగుణచిహ్నములు. అట్టివానియం దుండు మాంద్యము, సోమరితనము, తూఁగుఁబోతు తనము మొదలగునవి గోచరము లగుచుండును. వానికిఁ బ్రవృత్తియందు ఇచ్ఛయుండదు. ఏకార్యమునఁ గాని దిగుటకు బుద్ధిపుట్టదు. ఉన్నచోటువిడిచి కదల కుండు టయే వానికిఁ బరమసుఖమై తోఁచును.

కొంచెము కొంచెము బహిర్విషయములవలని సుఖము రుచిగన్నవాఁడై సుఖసాధన వస్తు సంపాదనకై క్రమముగా యత్నించును. ఒకతూరి యనుభవించిన యింద్రియసుఖములను మరలఁ బొందఁ గోరును. సుఖముల ననుభవింప వానియం దభిలాష యధికమగును. ఇట్లింద్రియ సుఖ సాధనముల మనస్సునఁ బర్యాలోచించుటచేతను, అందులకువలయు వస్తుసంపాదనకై పాటుపడుటచేతను, అంత కంతకుఁ దమోగుణమడుగంటి రజోగుణము వృద్ధియగును. రాజసగుణప్రధానముగా నుండువానియందుఁ గామ క్రోధ లోభనులు బలిసి యుండును. ధనార్జనమునకును, తద్రక్షణమునకును, నానావిధముల యత్నించును. ఎంతసేపు పనిచేసినను విసుగు చెందఁడు. ఎంతసంపాదించినను తనివి నొందఁడు. సంపాదించుటయందు న్యాయాన్యాయ విచారమైనం జేయఁడు. అట్టిమనుజుఁడే కార్యమునఁ బ్రవేశించినను దానిచేఁ దన కొక్క ఫల మపేక్షించును. చిరకాలమునకుఁ బిమ్మటఁ దుచ్ఛము లగునింద్రియసుఖములం దించుక విరక్తి పొడమి, విద్యను సంపాదించవలయు ననియుఁ బండితుండ ననిపించుకొనవలయు ననియుఁ బేరుప్రతిష్ఠలు సంపాదించవలయు ననియు ఎల్లయెడల దానుపూజ్యుఁడ గావలయుననియుఁ గొన్నినాళ్లు

ఉద్యోగించును. పూర్వకాలమునఁ గొంద ఱిహలోక సుఖముల నెల్లఁ ద్యజించి స్వర్గభోగంబులకై తమ యావచ్ఛక్తియుఁ, గాలమ్మును, గడపుచుండెడివారు ఇప్పటికాలంబున నట్టివారు పెక్కుమంది గానరారు.

నరుఁడు చిరకాల మనేకవిధంబు లగుఫలముల నపేక్షించుచుఁ గర్మముల నాచరించుచు వానిఫలంబులం గుడుచును. అయినను ఆఫలంబులన్నియు అనిత్యంబులై ప్రథమమున నమృతతుల్యములుగా నున్నను తుదకు విషతుల్యముగాఁ బరిణమించును. కావున వానికిఁ గొంతకాలమునకుఁ గర్మఫలంబులందు నిస్పృహ కలుగును. అంతట వాఁడు కర్మలను విడుచును. కర్మములచే శాంతి కలుగదనియు నవి బాధహేతువులనియు, మోక్షమును బొందఁ గోరువారు కర్మమును ద్యజింప వలయుననియు నెంచి కర్మసన్న్యాసం బొనరించును. అప్పటికిని వాఁడు శాంతిఁ గాంచనేరఁడు. విషయభోగమ్ముల బాహ్యంబున వదలినను విషయాభిలాష వాసనా రూపంబున వానిమనంబు నంటియుండును. ఇంద్రియసుఖంబుల నిచ్చువస్తువుల మనంబున స్మరించుచునే యుండును. బహిః శ్వేషమును మార్చవచ్చును గాని, అంతస్థితిని మార్చుట సులభముగాదు. 'కర్మేంద్రియాణి సంయమ్య.....మిథ్యాచార స్స ఉచ్యతే,'

కర్మంబులు బాధకు హేతువు లనుట నిక్కవంబు. అయినను బంధనశక్తి మనుజుఁడు చేయుకార్యములం దుండదు. వానిమనోభావంబు లందుండును. కర్మమును నేను చేయుచున్నాను (కర్త) సంగము (అహంకారము) కర్మఫలము నాకుఁ గావలయును (ఫలసంగము-మమకారము) అను నట్టిమనోభావములే బంధహేతువులు. అట్లగుటచేఁ గర్మములనువదలినమాత్రముచేతనే నరుఁడు మోక్షమును బొందనేరఁడు. "నకర్మణా మనారంభాత్." మనుజుఁడు వ్యవస్థలేక యిచ్చ వచ్చినట్లు అన్నికార్యములం బ్రవేశించి చేయఁ దలపెట్టరాదు. "నియతం కురు కర్మ త్వం" అనిభగవదనుశాసనము. కావునఁ బ్రతిమనుజుఁడును తనజ్ఞానశక్తినిబట్టి తనకు నియత మైనకార్యమును బుద్ధిచే పర్యాలోచనచేసి గ్రహించి యాచరింపవలయును. స్వకార్య మెంత కష్టముగాఁ దోఁచినను దానిని విడువ రాదు. ఇతరుల కార్య మెంతశ్లాఘాపాత్రముగాఁ గన్పట్టినను దాని యందుఁ జొరరాదు.

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః."

భ-గీ. అ ౩ శ్లో ౩౫.

"కర్మ ణైవ హి సంసిద్ధి మాస్థితా జన కాదయః
లోక సంగ్రహ మే వాపి సంపశ్యన్ కర్తు మర్హసి."
భ-గీ. ౩—20.

నిష్కామ కర్మాచరణముచేఁ గ్రమక్రమముగా రజోగుణము నశించి సత్వగుణ మావిర్భవించును. తమోగుణముచే నావరింపఁ బడినవేళ మనుజుఁడు క్రియారహితుఁడై యుండును. రజోగుణము విజృంభించియున్న కాలమున స్వలాభాపేక్షతో నానావిధ కార్యములం దగిలి కర్మపాశములచే బద్ధుఁ డగును. సత్వగుణము తనయందుఁ బ్రకాశించు నప్పుడు లోకోపకారార్థము సమస్తకార్యము లొనర్చుచుఁ గర్మబంధములను దగులకుండును. ప్రపంచ మనెడుమహాకుటుంబమందు జగత్ప్రభువగు భగవంతునియాజ్ఞ శిరసావహించి ప్రపంచసముదాయ యోగక్షేమమునకై పాటుపడుచుఁ దాఁ జేయు కార్యములవలన స్వప్రయోజన మొకింతయుఁ గోరక సర్వఫలంబులు భగవదర్పణము గావించు బ్రతిమనుజుఁడును ధన్యుఁడగును. అట్టివాఁడు తనయావచ్ఛక్తిని వినియోగించి యత్యంత భక్తిశ్రద్ధలతోఁ గార్యమొనర్చుఁ గాని అయ్యది సఫల మైనచో నుప్పొంగఁడు: విఫల మైన వగపు గాంచఁడు. జయాపజయములు భగవ దధీనములని

యతఁ డెలుంగును. స్వకర్మఫలంబును భగవదర్పణము గావించిన వానికి జయాపజయముల జోలి లేదు.

"యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః
తదర్థం కర్మ (కౌంతేయ) ముక్తసంగః సమాచర."

భ-గీ. 3—9.

'యజ్ఞార్థ మగుకర్మము చేయుటచేత బంధము కలుగదు. ఇతరవిధముగఁ జేయు కర్మము లన్నియు జనులకు బంధహేతువులు. కావున కర్తృత్వాభిమానము గాని, ఫలాపేక్షగాని లేక కర్మములను జేయుము.' యజ్ఞ మనఁగా భగవ దారాధనము. లోకోపకారబుద్ధితోఁ గర్మ మాచరించి యాఫలమును దాను గోరక భగవదర్పణము చేయుటయే యజ్ఞము. శ్రౌత స్మార్త కర్మములలో నెద్దాని నైనఁ బ్రారంభించు నపుడు 'శ్రీపరమేశ్వర ముద్దిశ్య శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం' ఇత్యాదివచనములతో సంకల్పించి పూనుకొనుటయుఁ గార్యాంతమున 'సర్వం శ్రీకృష్ణార్పణ మస్తు.' ఇత్యాది కారికలతో ఫలసమర్పణము చేయుటయు వాడుక. ఈనియమములు వైదికకర్మములకు మాత్రమే విధింపఁ బడియుండ లేదు. నిత్య నైమిత్తిక వైదిక లౌకికము లగు సమస్తకార్యములకును విధింపఁ బడి యున్నవి.

"యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్
యత్తపస్యసి (కౌంతేయ) తత్కురుష్వ మదర్పణమ్."
భగీ. 9—29.

ఇట్టివాక్యము లన్నియు నిరర్థకములును, మిథ్యా రూపములును, వృథా ప్రయాసహేతువులును గాక సార్థకంబులు, త్రికరణశుద్ధి యుక్తభావ నిర్వచనములు నై యుండవలయును.

'స్వేస్వేకర్మ'...'యతః ప్రవృత్తి' 'కర్మణైవహి సంసిద్ధిః.'

మనుష్యుం డెట్టి జ్ఞానవంతుం డగుగాక, లోకోప కార క్రియా నైపుణ్యము గలిగి భగవత్సంకల్పము ననువర్తించుచు లోకపరిపాలన కృత్యమున భగవంతు నకు దోడ్పడిన నాఁడు మాత్రమే పరిపూర్ణుఁడై మోక్షా ర్హుఁడగును.

జ్ఞానప్రకాశముచే భగవంతునితోడ సంయో గము ఘటింపఁ జేయునది జ్ఞానయోగము. మోక్ష సామ్రాజ్యమందఁ గోరువారి కియ్యది యెంతయుఁ బ్రశస్త మార్గము.

'నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే.' భ-గీ.4-38

జ్ఞానమువలె పవిత్రమైనది ఈలోకమందు నిజముగ మఱి యొకటి లేనే లేదు. కర్మయోగము ననుష్ఠించుట లోకములో నెక్కుడుగను సుకరమై

యుండును గాని జ్ఞానయోగ మతిదుర్లభము. అందఱి కిని సాధ్యమగునది కాదు. జ్ఞానమార్గమున నడవఁ దలఁచుకొన్నవానికి బుద్ధి తీక్ష్ణతయు ఇంద్రియనిగ్రహ మును సదాచారమును పరమావశ్యకములు. భగ వంతుఁడు తన కిచ్చిన బుద్ధిబలమును తుచ్ఛము లగు నింద్రియసుఖములకై ధారపోయుట మాని పారమా ర్థిక విచారమునకును లోకోపకారమునకును సమ ర్పించువాఁడు మాత్రమె జ్ఞానయోగాభ్యాసమునకు అర్హుఁడు. అట్టివాఁడు గ్రంథావలోకనంబునను, బ్రకృతి తత్వ పరిశోధనమునను నెల్లప్పుడు జ్ఞానా ర్జననిర తుండై యుండును.

"క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం య త్తత్ జ్ఞానంమతం మమ"
భ-గీ. 13—2.

క్షేత్ర క్షేత్రజ్ఞుల యొక్క జ్ఞానమే తన (పరమే శ్వరుని) జ్ఞానము.

ప్రకృతిలక్షణములఁ దెలియఁ జేయు జ్ఞానము నకు 'అపరావిద్యయనియు', బ్రహ్మస్వరూపమును బోధిం చువిద్యకుఁ 'బరావిద్య' యనియు సంజ్ఞలు. 'ద్వేవిద్యే.'

విద్యాభ్యాసముచేయుకాలమునఁ దమోగుణ రజోగుణంబులను జయించి శుద్ధసాత్విక గుణ విశిష్టుం డై యుండవలయును. తమోగుణ పీడితుం డయ్యె

నేని జ్ఞాన సమార్జనమే చేకూఱదు. రజోగుణపూరితుఁ డైనచో స్వార్థపరత్వ మధికమై కామ క్రోధములును అహంకార మమకారములును బలిసియుండును. జ్ఞానము స్వచ్ఛముగఁ బ్రకాశింపక మఱుఁగుపడి యుండును.

"ధూమేనావ్రియతే వహ్నిర్యథాఽఽదర్శో మలేన చ,
యథోల్బే నావృతో గర్భ స్తథా తే నేద మావృతమ్.
ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా,
కామరూపేణ (కౌంతేయ) దుష్పూరే ణానలేన చ."

భ-గీ. ౩. ౩౮—౩౯.

పొగచే నగ్నియు, దుమ్ముచే నద్దమును గప్పఁ బడినట్లును, మావిచే గర్భ మావరింపఁబడినట్లును దీని(రజోగుణము)చేసమ స్తము ఆవరింపఁబడినది. (కౌం తేయ) తృప్తినొందనిదియు, జ్ఞానికి నిత్యవైరియు కామరూపియు నైన యీయగ్నిచే జ్ఞాన మెల్లప్పుడు ఆచ్ఛాదింపఁబడియుండును.

"సత్త్వాం త్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ,
ప్రమాదమోహౌ తమసో భవతో ఽజ్ఞాన మేవ చ."

భ. 14—17.

సత్త్వమువలన జ్ఞానము, రజోగుణమువలన గేవ లము లోభమును బుట్టును. తమోగుణమువలనఁ బ్రమాదమును, మోహమును మాత్రమే గాక యజ్ఞా

నము సైతము పుట్టును. మొట్టమొదటఁ జిత్తము శుద్ధి చేసికొనవలయును. చిత్తశుద్ధివలననే జ్ఞానము లభించును. శుద్ధసాత్త్విక మగునంతఃకరణమువలన నింద్రియములకుఁ బ్రకాశమును దానిచే బుద్ధి తీక్ష్ణతయు దానిచే నిర్మల జ్ఞానమును గలుగును. సత్వస్థుఁడైనమనుజుఁడు, ధార్మికుఁడును పుణ్యకర్మలను జేయువాఁడును నగును. కాన నతనికి స్వర్గము లభించును. తామసుఁడు అధర్మము నాచరించి యధోగతినిఁ జెందుచున్నాఁడు. (సాంఖ్య కారిక .544.)

లోకములోని వస్తుజాల మనంతమై యుండును. ఒక్కొక్క వస్తువునం దుండుగుణములు అనేకములు. శాస్త్రము లసంఖ్యేయములు. ఎన్నివస్తువుల శోధించినను, ఇంకను శోధింపఁ దగియుండును. ఒక్కొక్క వస్తువునందు ఎన్నిగుణములను బరీక్షించినను అంతము గనపడదు. ఎన్నిగ్రంథములు చదివినను ఇంకను జదువఁ దగిన గ్రంథములు మిగిలియుండును. ఈభూగోళము నందలి పదార్థము లన్నింటినిఁ గడిగి గాలించి చూచినను బ్రహ్మాండమున నిట్టిగోళము లెన్నియో యుండును. ఈవిచార మెప్పటికిని దుదముట్టదు. (నాంతోస్తి మమ విద్యానాం) కావున అపరావిద్యకు బారములేదు.

పురుషుఁ డెంతకాలము బహిర్ముఖుఁడై విషయ విచారము చేయుచుండునో యంతకాలము భేదబుద్ధి కలిగి యుండును. ప్రపంచములోని విషయములు రూప భేదముచేత, నానావిధములై యుండును. ఒకదాని వలె నొకటి యుండదు. వివిధవస్తు విచార తత్పరుండై యున్నచో మనస్సునకు భేదములు పొడగట్టునుగాని లోపల దాగియున్న ఐక్యభాగము గోచరింపదు.

"సర్వభూతేషు యే నైకం భావ మవ్యయ మీక్షతే,
అవిభక్తం విభక్తేషు త ద్జ్ఞానం విద్ధి సాత్వికమ్."
భ-గీ. 18—20.

విభక్తమయినదియు (వేర్వే అగు సర్వభూతములందు నొకటే యైనది.) నవిభక్తమైనదియు, నవ్యయమైనదియు నగుభావము (తత్త్వము) న్నదియని యేజ్ఞానముచే నెఱుఁగఁబడునో యది సాత్త్వికజ్ఞానము. అట్టి యభేదజ్ఞానమే ఆత్మజ్ఞానము. బహిర్దృష్టి చాలించి మానవుఁ డంతర్ముఖుఁడై ఆత్మరూపమును విచారింపవల యును. అఖండమై, అద్వితీయమై, సర్వవ్యాపకమై, సమస్తపదార్థముల లోపలను, వెలుపలను, నిండి నిబిడీకృతమై వెలుఁగుచున్న బ్రహ్మమును గుఱించిన ప్రత్యక్ష జ్ఞానమే యథార్థజ్ఞానము. నామరూపము లసంఖ్యాము లైనను, వస్తువొక్కటియే.

"అవిభక్తంచ భూతేషు విభక్త మితి సంస్థితం."

బైటఁ జూచుటకు వేఱ్వేఱుగాఁ గనఁబడినను వాస్తవముగా నవిభక్తమై యున్నది.

"అహ మాత్మా గుడాకేశ" బ్రహ్మాది స్థావరాంతముగల అసంఖ్యేయము లగు భూతకోటులయం దుండెడు నాత్మ ఒకటియే. ఆత్మవినా లోకమున వేఱుపదార్థములేదు. సమస్తము ఆత్మయొక్క పరిణామముగాని వేఱొండు కాదు. లోకములోని సమస్తవ్యాపారములకు ఆత్మకారణమై యుండును. అయ్యది అందఱియందు సమముగా ఉండును. సజ్జనులయందును, దుర్జనులయందును, మంచిపదార్థములందును, చెడ్డపదార్థములందును, అమృతమందును, విషమందును సమానముగా నుండును.

"అమృతంచైవ మృత్యుశ్చ స ద స చ్చాహ మర్జున."

భ-గీ. 9—19.

లోకములో ఏమనుష్యునిఁ జూచినను, ఏపదార్థమునుజూచినను, దానియందు వస్తుబుద్ధిలేక, బ్రహ్మభావముగలిగియుండుటయే జ్ఞానము. అట్టిజ్ఞానమారంభమైనమాత్రమునఁ బురుషునకు నిత్యా నిత్యవస్తువివేకము గలుగును. దృశ్యము లగుపదార్థము లన్నియు అనిత్యములనియు సర్వాంతర్యామియగు ఆత్మ మాత్రమే

నిత్యమనియు వాఁడు గ్రహించును. దానివలన అనిత్య పదార్థములయందు వైరాగ్యము జనించును. క్రమముగా షట్సంపత్తియు ముముక్షుత్వమును గలుగును. అంత బ్రహ్మవిచారమున కధికారియగును.

మొట్టమొదట పురుషుఁడు జీవాత్మయనియు భగవంతుని యంశమనియు భగవంతునకుఁ దనకు వస్తుభేదమించుకేనియు లేదనియు నెఱుంగవలయును. ప్రపంచమంతయు భగవత్స్వరూపమనియు వేఱు పదార్థమే లేదనియుఁ దెలియవలయును. ఇదియంతయుఁ బ్రత్యక్షజ్ఞానమై స్వానుభవమునకు రావలయును.

శ్రీకృష్ణమూర్తి భగవద్గీతయందు అర్జునునకు కర్మ భక్తి జ్ఞాన యోగములను సాంగోపాంగముగ వివరించుటయేగాక వాని యంతర్భూతంబు లగునభ్యాసయోగాది సమస్తవిషయములతోడ నధ్యాత్మవిద్య యంతయు విస్తరముగ నుపదేశించి కడపట గ్రంథమును ముగింపుచేయు సమయమున "మన్మనాభవ" అనిపలికెను. ఎన్నివిషయము లుపదేశించినను భగవంతుని నిశ్చయాభిమతము ఇచట సూచింపఁబడియెను.
"సా త్వస్మిన్ పరమప్రేమరూపా" (నారదభక్తి).
"సా పరాను రక్తి రీశ్వరే" (శాండిల్యసూత్ర 2).

"మనుజునకు ఈశ్వరునియందుఁ గలుగుపరమప్రీతియే భక్తి." సత్పుత్రునకుఁ దండ్రిపైఁ గలుగు ప్రేమ

పితృభక్తి; పతివ్రత యగుస్త్రీకి భర్తపై నుండు ప్రేమ పతిభక్తి; సచ్ఛిష్యులకు గురువునెడఁ గలుగు ప్రేమ గురుభక్తి; ప్రజలకుఁ బ్రభువుదెసఁగల భక్తి రాజభక్తి. వీనియన్నిటియందుఁ గలసామాన్య ధర్మము విచారించి చూచిన యెడల జ్ఞానమునం దును, శక్తియందును, సద్గుణసంపత్తియందును తనకంటె నున్నతపదవియందున్నవారియెడ మనుజునకుఁ గల ప్రేమమే భక్తియని యేర్పడుచున్నది. ఆవిధముననే జ్ఞాన స్వరూపుఁడును, సర్వశక్తిసమన్వితుఁడును, సమస్త కళ్యాణ గుణ పరిపూర్ణుఁడును, నగునీశ్వరునిపై జీవు నకుఁ గలుగు ననురాగమే భక్తి.

లోకములో మనుష్యులు బహువిధము లైన యభీష్టములతో భగవంతుని భజింతురు. ధర్మార్థకామ ములను త్రివిధపురుషార్థములను గోరుదురు. ఆపత్సమ యమునఁ దన్నివారణార్థము కొందఱును, శుభకార్యా రంభమున దాని నిర్విఘ్నపరిసమాప్తికై కొందఱును, సంతానవాంఛచేఁ గొందఱును, శత్రుజయంబునకై కొందఱును, రాజానుగ్రహప్రాప్తికై కొందఱును నానా రూపంబులగు ఫలంబులను గోరి యీశ్వరునిఁ బ్రార్థిం తురు. ఏయుద్దేశముతోఁ గాని యొకప్పుడును జగదీశ్వ రుని స్మరింపని మూఢులకంటెను, పైఁజెప్పినట్లు ప్రతి

ఫలాపేక్షచేనైనఁ బ్రార్థించువారు శ్రేష్ఠులే. అయిననది యుత్తమమైనభక్తి కానేరదు. ఈశ్వరునియందు భక్తి చేసి అందుకు బదులుగ నీశ్వరునివలన నొకకార్యసాధనము గోరెనేని అయ్యది వ్యాపార మగుఁగాని భక్తి కానేరదు.

"యస్త ఆశిష ఆశాస్తే న సభృత్య స్స నై వణిక్."
(ప్రహ్లాదుఁడు.)

కొంచెమైనను బ్రతిఫల మపేక్షింపక నిర్హేతుకముగను, స్వభావసిద్ధముగను, భగవంతునిపైఁ గలుగు పరమప్రేమయే భక్తి. సమస్తవాంఛలను వదలి యితర పురుషార్థములం గోరక సర్వకాల సర్వావస్థలయందును (సృష్టియందు) దదేకధ్యానతత్పరుఁడై భగవత్పాదారవిందములను మనంబున నిలిపి తదానందము ననుభవించుచుఁ బరవశుండై చూచువానికి నున్మత్తునింబోలెనుండువాని భక్తియే యనన్యభక్తి.

భక్తునకు ప్రజ్ఞాపూర్వక జ్ఞాన మత్యావశ్యకము. జ్ఞానరహిత మైన కేవలమూఢభక్తి యత్యల్పఫలదాయిని యగును. అయ్యది పరిపూర్ణఫలకారిణి కావలయునేని జ్ఞానసహితమై యుండవలయును. తనస్వరూపము, తా నారాధించు భగవంతుని స్వరూపము, ఉభయులకుఁ గల యన్యోన్య సంబంధము, ఉపాసనక్రమము,

దానిచేఁ గలుగు ఫలము వీనినిగుఱించి పూర్ణమును యథార్థము నగుజ్ఞానము భక్తున కుండవలయును.

"చతుర్విధా భక్తిః."

భక్తుఁడు లోకములో మనుష్యులను, పశువులను, స్థావరపదార్థములను, సర్వమును భగవత్స్వరూపముగ నెఱుంగవలయును.

"న త దస్తి వినా."

భక్తి యనునది యంతరంగభావము. బహిర్వేషము గాదు. భక్తుని మనస్సు మిగుల పరిశుద్ధమై యుండవలయును. దానియందేవిధమైన మాలిన్యము చొరఁబడనీయక కామక్రోధాది కలుషముల నెల్ల నశింపఁజేసి సుఖ దుఃఖాది ద్వంద్వములచేఁ జలింపనీయక, సమత్వంబున నుంచవలయును. ఎవ్వరియందును ద్వేషబుద్ధి లేక సర్వభూత దయాసమన్వితుండై సకలసద్గుణ పరిపూర్ణుఁడై యుండవలయును. తా నుపాసించు నీశ్వరుఁడు సమస్త కళ్యాణ గుణ పరిపూర్ణుఁడు గాన తానట్టి గుణములచే నొప్పకున్న వాని యనుగ్రహమునకుఁ బాత్రుఁడు గా నోపఁడు. భక్తి యోగమునకు వైరాగ్యము చిత్తశుద్ధి సద్గుణసంపద మూలాధారములై యుండును. (చూ॰ భ-గీ. 12-62) దేవతార్చనచేయు

సమ[illegible]మానం

బున నెట్టిసంకల్పములు పుట్టినను వాక్కున నెట్టివచన ము:లు వెలువడనున్నను, తా నెట్టికార్యములు చేయనుద్య మించినను, ఇదిభగవంతునికిఁ బ్రీతికరమగునా ? కాదా ? యని విచారించి మఱీ చేయవలయును. భగవత్కైంకర్యముకంటె భాగవతకైంకర్య మీశ్వరునికిఁ బ్రీతి కరమై యుండును. భగవత్సంబంధము లగుభూతము లకు మనమెంత మేలొనరింతుమో ఆపరమపురుషు నకు మనయం దంత ప్రేమయు ననుగ్రహంబును గలు గును. కాన కర్మ ఫల త్యాగ రూప మైనయోగమే (అనఁగా జ్ఞాన భక్తి యుక్త నిష్కామకర్మయోగమే) యన్ని మార్గములలోను శ్రేష్ఠ మైనది. ఇది భగవ ద్గీతామతమేకాదు. సూర్యగీతలయందుఁ గూడ

"జ్ఞానా దుపా స్తి రుత్కృష్టా కర్మోత్కృష్ట ముపాసనాత్
ఇతి యో వేద వేదాంతైః స ఏవ పురుషో త్తమః"

జ్ఞానముకంటె ఉపాసన(ధ్యానము) లేక, భక్తి యుత్కృష్ట మైనది. ఉపాసనకంటె (నిష్కామ) కర్మ శ్రేష్ఠ మైనది. ఈవేదాంతతత్త్వమును దెలిసికొన్నవాఁడె పురుషోత్తముఁడు. అట్టిపురుషోత్తముఁడే బ్రహ్మర్షి. అతఁడు మూర్తీభవించిన యోగమన నొప్పును. అతఁడు ద్వేష మెఱుఁగఁడు. సర్వభూత సమభావుఁడు. [illegible] వాఁడు,

నిత్యసంతుష్టుఁడు. సంయమి. దృఢనిశ్చయుఁడు. మనో బుద్ధులు భగవదర్పితము చేసినవాఁడు లోకులవలన వ్యాకులపడఁడు; లోకుల వ్యాకులపెట్టఁడు; హర్షక్రోధ భయ విషాదములచే వికారము నొందఁడు.

నిరపేక్షి, శుచి, దక్షుఁడు. (ఏకార్యమైన ఆల స్యములేకచేయువాఁడు.) ఫలవిషయముల ఉదాసీ నుఁడు. వికారములచే వికారము నొందఁడు. కామ్య ఫలముల విడిచినవాఁడు. ఏవిషయమునుగూర్చియు ఆనంద మందఁడు, ద్వేషింపఁడు, శోకింపఁడు, ఇచ్ఛ గింపఁడు, శుభాశుభదూరుఁడు. శత్రుమిత్రులందును, మానావమానములందును, శీతోష్ణములందును, సుఖ దుఃఖములందును సమభావము గలవాఁడు. ఎందును నాసక్తి లేనివాఁడు. నిందాస్తుతులకు క్రుంగఁడు, పొంగఁడు మితభాషి. ప్రాప్తలాభసంతుష్టుఁడు. స్థిరమతి. అనికే తుఁడు. (కర్మఫలాశారూపమగు వాసము లేనివాఁడు.) యోగము నాశ్రయించువాఁడు. కర్మల నాచరించు చాతుర్యము నార్జించువాఁడు.

"యోగః కర్మసుకౌశలం." (భ-గీ. 2—50.)

"తస్మాత్ యోగీ భవ." (భ-గీ. 6—46.)

"కొంచెపు టశనంబు గొనుచు సంగంబులఁ

బాసి యింద్రియముల పజ్జఁ జనమి

శబ్దాది యైనవిషయజాత మంతరం
గంబున సంపడి గాక యుండ
సద్బుద్ధి దృఢ మగుసాధనంబుగఁ గొని
మరలిచి యాత్మన మనసు నిలిపి
యపగతసంకల్పుఁ డైయుపల స్థాణు
భంగిక స్థితిఁ బనుపడి దివంబు
రాత్రియును యోగసేవానురతి నివాత
దీపమునుబోలె వెలుఁగు నాత్మీయమూర్తి
గనుచు నెడ నెడను పరమకాలములు, స
నంగ వర్తించి యోగి యానంద మొందు." శా. 6ఆప38.

రాజసూయములు అశ్వమేధములు అపరిమిత
ములైనను యోగమునకు సరిగావు. శా. 6ఆ. 247 ప.

రాగ ద్వేషములను విడి
యోగంబును బూని బ్రహ్మయోగియయి సదా
యాగంబుచేయు చాత్మను
యోగీశ్వరుఁ గొల్చునట్టియోగిఁ దలంతున్.

స్థిరకృతి నుతిపాత్రా! దేవతారాజ మిత్రా!
సరళ హృదయ గమ్యా! సార సౌహార్ద రమ్యా!
సుర నుత గుణ ధారీ! శోభి తాంతస్థ శౌరీ!
భరిత సకల దీనా! ప్రస్తు తాత్మాభిమానా!

శ్రీ మ త్కవితా దీపా!
కామిత దీనావ నైక కార్య కలాపా!
శామిత సంసృతి తాపా!
రామాజన పుష్పచాప! రామయభూపా!
దివ్యచిత్తంబున అవధరింపుము.

## తపోభూమి

### యజ్ఞము

అఖిల భూతములకును మేలు గలుగఁ జేసి సుఖ సాధనమైనది ధర్మము. ధర్మము వేదమువలన నెఱుంగఁ దగినది. వేదము బోధించెడు ధర్మములయందు యజ్ఞ మను నది శ్రేష్ఠ మనుట నిర్వివాదము. యథార్థ మగు యజ్ఞస్వరూపము యాగానుష్ఠానకాలమున జపింపఁదగు మంత్రముమూలముననే నిర్ణయింపఁ దగినదనుట సర్వ సమ్మతము. మంత్రార్థ విచార పురస్సరముగ నిర్ణయిం చిన యజ్ఞముయొక్క స్వరూప మెట్టిదనిన 'ఈశ్వరుని సఖ్యమును వరించుటయే యజ్ఞము' 'ఈశ్వరానుకూ ల్యమె ధర్మ' మని సకలశాస్త్రకారులును ఒప్పియు న్నారు. సర్వ భూత హితమును గోరి, పరమదయాళు వగునీశ్వరుఁడు జగత్సృష్టిస్థితి సంహారములను జేయును గాన మనము చేయఁదగిన యజ్ఞాది ధర్మము లన్ని యును సర్వ భూత హితకరములుగ నుండవలయును గదా! ఇట్లుండ మనదేశమందు అతిశిష్టులు చేయు నగ్నిష్టోమమే మొదలుగాఁగల మహాయజ్ఞములయందు

మేఁకలు మొదలగు ప్రాణులను జంపువారినిఁ జూచు వారి కీశంకలు పుట్టును. ప్రాణివధ శాస్త్రవిహితమా? హితముగానిచో యజ్ఞము ధర్మమనిపించుకొనునా? ధర్మము కానియెడల యజ్ఞము సర్వధర్మములకును మూలప్రమాణ మని యెట్లుబోధించెడిని! ఇదియే మొదలుగాఁగల శంకలచే పండితులగువారియం దనేకు లకు వేదమునందును వేదోక్తకర్మములయందును అనా దరము పుట్టియుండుట యెల్లరకు విశదమె. కావున న్యాయాను సారముగఁ బ్రమాణవిచారమును జేసి యిట్టి యనాదరమును దొలఁగించి వేదోక్తమార్గమునందుఁ బ్రవృత్తిని బుట్టించుట యాస్తికుల ముఖ్య కర్తవ్యము.

శ్రుతియందలి పశుయోగప్రకరణము: తొలుత వేదప్రమాణము ననుసరించి విచారింతము. పశుయాగ మును విధించెడు ప్రకరణమున శ్రుతి,

"ఆసోమం వహం త్యగ్నినా ప్రతితిష్ఠ తే
తౌ సంభవంతౌ యజమాన మభిసంభవతః
పురా ఖలు వైష మేధా యాత్మాన మారభ్య
చరతి యో దీక్షితః॥
యదగ్నిషో మీయం పశు మాలభత ఆత్మ
నిష్క్రయణ ఏ వాస్య సః
తస్మా నాశ్యం పురుష నిష్క్రయణ ఇవ హి॥

అథో ఖ ల్వాహుః అగ్నీ షోమాభ్యాం వా
ఇంద్రో వృత్ర మహ న్నితి
యద గ్నీషో మీయం పశు మాలభతే వా
ర్త్రఘ్న ఏ వాస్య సః తస్మా ద్వాశ్యం." తై. సం 6-1-11

సోముని ఆహవనీయాగ్ని సమీపమునకుఁ దెచ్చె దరు. సోముఁడును అగ్నియుఁ గలిసి స్థిరముగా నుం దురు. అట్లుచేరిన యగ్నిసోములు యజమానుని ఆశ్ర యించి యుండెదరు. దీనిఁ దెలిసియే పూర్వకాలమున దీక్షవహించెడు యజమానుఁడు తన్ను సమర్పించి దేవతాకార్యములను నిర్వహించుటద్వారా యజ్ఞవిధా నము నాచరించువాఁడు యజమానుఁడు. అగ్నిసోము లకుఁ బశువును సమర్పించుచు హోమము చేయుచు అందువలన దేవతలకు పశువనెడు నమూల్యవస్తువు నొసంగి తన్ను విడిపించుకొన్నవాఁ డగును. కావునఁ బశుమాంసమును దినఁ గూడదు. యజమానునకు బదు లుగా నొసంగిన వస్తువగుటవలన దానిని యజమానులు మొదలగువారలు భుజించుటవలన వెలయిచ్చినట్లు కాఁజాలదు. ఈవిషయమున నింక నొకపక్షమున్నది.

అగ్నిసోములకొఱకు ఇంద్రుఁడు పుత్రుని వధిం చెనని చెప్పెదరుగదా అగ్నిసో మార్థముగఁ జేయు పశువధ వృత్రవధ యగును. వత్రుఁ డనుశత్రుస్థానమునఁ

బళు వుండును. పశువధ శత్రుహనన మగును. గనుక ఆపశుమాంసము తినఁదగినదే.

భగవంతునియం దాత్మసమర్పణమే నిజమైన యజ్ఞము.

యజ్ఞదీక్షయన అగ్నిసోము లనుమూర్తిద్వయ మునుధరించిన ఈశ్వరునకు యజమానుఁడు తన్ను సమర్పించుకొనుట తనస్వార్థమును మాని యీశ్వరుని కైంకర్యమునందే యావచ్ఛక్తిని వినియోగించుట. ఇదే ముఖ్యయజ్ఞము. ఇదే ధర్మలక్షణము. ఇదియే వేదోక్త మగుయజ్ఞముయొక్క యథార్థస్వరూపము. అగ్నియనఁగా శివుఁడు, రుద్రుఁడు; సోముఁ డనఁగా విష్ణువు. శివవిష్ణు రూపములు ధరించిన జగద్వ్యాపారము నడిపించు హరిహరాత్మకుఁ డగుపరమేశ్వరునికైంక ర్యమే యజ్ఞ మనిపూర్వకాలమున యజ్ఞదీక్షను వహిం చిన వారందఱును గ్రహించియుండిరి. అగ్నియు, సోముఁడును లేక రుద్రుఁడును విష్ణువును అనెడి పరమే శ్వరునిమూర్తి ద్వయమున అఖిలదేవతలును అంత ర్భూతులై యున్నవారలనియును దీక్షితుం డగు వాఁడు ఈమూర్తిద్వయ విశిష్టుఁ డగుపరమేశ్వరుని ద్వారా సర్వదేవతలకును తన్ను సమర్పించుకొనువాఁ డనియు శ్రుతిచెప్పుచున్నది.

"రుద్రో వా ఏష య దగ్నిః." తై. సం 5-4-3.
"యో వై విష్ణు స్సోమ స్సః." తై. 34—21.
"సర్వాభ్యో వా ఏష దేవతాభ్య...లభ తే
యో దీక్ష తే అగ్ని స్సర్వా దేవతా దేవతాః"
ఐ. బ్రా. 6—3.

ఈ ప్రమాణవాక్యములనుబట్టి చూచినచోఁ బూర్వులు పరమేశ్వరునకు ఆత్మసమర్పణముచేయుటయే యజ్ఞ మని గ్రహించి రని తెలియవచ్చుచున్నది. కాఁగా మనుష్యునియందు లోభము పుట్టి స్వార్థపరత హెచ్చి యీశ్వరకైంకర్యము మాని స్వతంత్రుఁడై యాగదీక్ష వహించి తనస్థానమునఁ దనసొత్తగు గోవు మొదలగు పశువులను దేవతలకు సమర్పించి తాను మాత్రము తనకార్యములందుఁ బ్రవర్తించుచున్నాఁడు. దీక్షితుఁడు లోభముచే భగవత్కైంకర్య మనెడు స్వధర్మమును విడిచి స్వార్థపరుఁడై తాఁ జేయఁ దగిన భగవత్కైంకర్యము గోవు మొదలగుపశువులచేఁ జేయింపఁ దొడఁగె ననుట స్పష్టము. లోభ మంకురించఁగానే దీక్షితుని మనస్సు బహిర్ముఖ మయ్యెను. ఆతఁడు చేసెడుయాగము సైతము తద్రూపమునె తాల్చెను. పూర్వము యోగయుక్తమగు మనస్సుయొక్కవృత్తులగు సంకల్పము, మేధ, విజ్ఞానము నను నవి దీక్షితుని లోపల

అగ్నులై యుండునవి. అట్టియంతరగ్నులు పోయి వాని స్థానమున ఆహవనీయాది బాహ్యాగ్నులు వచ్చినవి. కామక్రోధములను నిరోధించి చిత్తమును భగవంతుని యందు నిల్పుటయను తపస్సుపోయి దానిస్థానము నందతఁడు ఆజ్య సమిధలను వైచి యగ్నిని మండించు టయే యగ్నిహోత్రకర్మ మైనది. ఇట్టిఅగ్నిహోత్రరూప మగుభగవదారాధనకు అంగముగ గోవుపరిణమించెను. గోక్షీరముచేతను, ఆజ్యముచేతను, అగ్నిహోత్రము నందు హోమాదులు జరుగును. ఈరీతిని తనసొత్తగు గోవుమొదలగు పశువులను అగ్నిహోత్ర మనెడు దేవతాకార్యమునకు వినియోగించి తాను మాత్రము స్వకార్యములను స్వార్థముగాఁ జేయుచు దీక్షితుఁడు కృతార్థుఁడ నైతినని భావించుచుండును. కావున పశు యాగము కేవలము కామ్యకర్మము. భగవదారాధన మనుముఖ్యయాగము విడిచి క్షుద్రదేవతారూప మగు పశుయాగమునఁ బ్రవర్తించెడువార లందఱు కామ ప్రేరితులు.

"కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః
తంతం నియమమాస్థాయ ప్రకృత్యానియతాః స్వయా"
భ-గీ. 7—20.

తమతమ ప్రకృతి నియమానుసారముగ నా యా (స్వర్గాదిఫలములయందలి) వెట్టివెట్టి కోరిక లందిన లోకు లాయాయుపాసనలయొక్క కోరికల ననుసరించుచు ఇతర (వేర్వేఱు) దేవతలను భజించు చున్నారు.

"కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా."

భ-గీ. 4—12.

కర్మఫలమును గోరు లోకమునకును కర్మఫల మీమనుష్యలోకమందు శీఘ్రముగనే ప్రాప్తమగును.

యజమానుఁడో లేక ఋత్విజుఁడో లేక కొందఱు క్షుద్రదేవతలో పశువులయొక్కరక్తము మాంసము మొదలగువానిచేఁ దృప్తిపొందుకొఱకుఁ జేయఁబడు నదికానఁ బశుయాగము కేవలము ఈశ్వరప్రీతికర మైనది కాదు. దేవతలు తృప్తిపొందుటవలన యజ మానునకు శీఘ్రముగఁ గొన్నియల్పప్రయోజనములు గలుగును.

ఆశాబద్ధుఁడు క్షుద్రదేవతలకు వశుఁ డగును. మనము గోవున కాహారము నొసఁగి దాని పాలు మొదలగునవి యెట్లుఅనుభవించుచున్నారమో యట్లే దేవతలు తమ్ము ఆరాధించువానికి ఇష్టసిద్ధి నొసఁగి

వానిని దమపనులయందు వినియోగించుకొనియెదరు. ఆదేవతలు తమయారాధకుని దృప్తుఁజేసి అతఁడు తమ్మునే యెల్లప్పుడును సేవించుచుండునటుల జాగరూకులై యుందురు. ఆరాధకునకు ఆత్మస్వరూపజ్ఞానము రాకుండునటులఁ జూచికొందురు. ఎవఁడు ఈశ్వరాంశ సంభూతుఁడుగాఁ దనయథార్థస్వరూపమును దెలిసికొనువాఁడో అట్టివాఁడు భగవంతునే సేవించును. అతఁడు దేవతలకువశుఁడుగాక వారినే తనకు వశులగునట్లు చేసికొనును. (బృ. ఉ. 4–10 భార. శాంతి. 336-10-11. మత్స్యపు. 143 అ. వాయుపు. 57 అ) పురాణములుఃఇంద్రాదిదేవత లీలోకమునకువచ్చిహింసాత్మకములగుయాగములను బ్రచారముచేసి రనిచెప్పుచున్నవి. త్రేతాయుగము యొక్క యాది యందు యజ్ఞ ప్రవర్తన మెట్లులైనదనియడుగఁగా సూతపౌరాణికుఁడు ఇంద్రుఁడిచ్చటయజ్ఞమును బ్రారంభించెననియు, మహర్షులా యూపములకుఁగట్టబడిన పశువుల దైన్యావస్థను గాంచి సహింప నోర్వలేక యింద్రునితోఁ బశుహింస తగదని వాదించిరనియు ధాన్యద్రవ్యములచే యజ్ఞము చేయఁ దగినదనియుఁ జెప్పినను వినకుండుటచే నుభయులును 'ఉపరిచరవసువు' అనురాజశ్రేష్ఠుని మధ్యస్థునిగఁ జేసికొని యతని యభిప్రాయ మడిగి రనియు, దేవతల

యందు పక్షపాతము వహించి నారలపక్షమే సరియని యర్థము చెప్పుటవలన నాతని శపించిరనియుఁ బ్రత్యుత్తర మిచ్చెను.

జ్ఞానముచే బ్రాహ్మణుఁ డైనవాఁడు యజ్ఞమాచరించుటద్వారా దేవఋణమును దీర్చియే మోక్షముకొరకు యత్నముచేయవలయునని శాస్త్రకారులు చెప్పియున్నారు. బ్రహ్మాండరూప మగు ప్రపంచమునందు విష్ణువు సాక్షాత్తుగను, దేవతలమూలకముగను, లోకపాలనరూప మగుపని నెటుల నిర్వహించునో అటులనే పిండరూప మగుమనశరీరమునందును విష్ణువు ఈశ్వరాంశ మగుజీవరూపమును ధరించి నాయకుఁడయ్యును దేవతలు దేహేంద్రియరూపములను ధరించి, యుపకరణములయ్యును, బని చేయుచుందురు. వారల యనుగ్రహములవలననే మనుష్యులకుఁ గలదేహేంద్రియముల శక్తులు క్రమక్రమముగ లభించియున్నవి.

నిత్యాత్మదృష్టి క్షుద్రజంతువులయం దుండుట లేదు. ఇది మనుష్యునకు దేవతానుగ్రహమువలన లభించియుండు పరమలాభము. ఇట్టినిత్యాత్మభావన మొదట దేహేంద్రియముల సంబంధమునందే పుట్టును. మొదటి దేహేంద్రియములయందే యహంకార మమకారములు పుట్టును. వానిని దప్పించి యీశ్వరాంశ

మగునిజరూపమునైపు ఆత్మభావనను మరల్చి నడచుటయే యాడియందు జ్ఞాని యగుబ్రాహ్మణునకు ముఖ్య కర్తవ్యము. ఇట్లు విష్ణువు మొదలగు దేవతల యనుగ్రహమువలన లభించియుండు నాత్మవీర్యమును, దేహేంద్రియములశక్తిని, దేవతలకార్యమునందే వినియోగించుటవలన దేవతలఋణము తీరుననుట యుచితమే కదా! ఈశ్వరాజ్ఞానుసారము లోకసేవచేయుటయే దేవతలకార్యము. కావున లోకహితార్థముగఁ దన యావచ్ఛక్తిని వినియోగించుటవలన దేవతలఋణము తీరును. లోకహితార్థముగఁ బనిచేయువానికి దేవతానుగ్రహమువలన, ఆత్మవీర్యమును, దేహేంద్రియముల శక్తియును వృద్ధియై యపూర్వశక్తివిశేషములు లభించును. కావున యజ్ఞ మవశ్యకర్తవ్యము. యజ్ఞ మన నీశ్వరున కనుకూలముగ వర్తించుట, సర్వాంశములయందును ఈశ్వరున కనుకూలముగ వర్తించుట మహాయజ్ఞము. అట్లువర్తించువానికే బ్రహ్మాత్మదృష్టి దృఢముగ నిలిచి పరముక్తి లభించును.

జన్మమరణము లనెడువానిబంధములనుండి ముక్తులము కావలసినచోఁ గామసంకల్పముతోఁ బనిచేయుట మాని, యజ్ఞరూపములగు పనులను జేయవలయును. యజ్ఞమువలనఁ గర్మము తొలఁగి పోవును.

"అన్నా ద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః
యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞకర్మసముద్భవః
కర్మ బ్రహ్మో ద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్."

భ.-గీ. 3-14-15.

ప్రాణులన్నియు నన్నముచేఁ బుట్టుచున్నవి. అన్నము పర్జన్యుఁడు వర్షించుటవలనఁ బుట్టుచున్నది. పర్జన్యుఁడు యజ్ఞమువలనఁ బుట్టుచున్నాఁడు. కర్మలనుండి యజ్ఞ ముద్భవిల్లుచున్నది.

కర్మ, బ్రహ్మమునుండి, అనఁగాఁ బ్రకృతినుండి పుట్టినదని తెలిసికొమ్ము. ఈ బ్రహ్మ మక్షరమునుండి, అనఁగాఁ బరమేశ్వరునినుండి బయలువెడలినది. కాన సర్వగత మగు బ్రహ్మమే యజ్ఞమునం దెప్పుడునధిష్ఠించి యున్నది.

యజ్ఞము వెనుక జగత్తును జగత్తువెనువెంటనే యజ్ఞమును గలవు.

"అనుయజ్ఞం జగత్సర్వం యజ్ఞ శ్చానుజగ త్సదా."

శా. 267—34.

యజ్ఞరూప మగుకర్మము మనుజులను బ్రహ్మ మందుఁ జేర్చును. యజ్ఞరూప మగుకర్మము మనుజున

కెపుడు స్వభావముగ నిలుచునో యపుడు బ్రహ్మత్వము సిద్ధించును.

"యజ్ఞః కర్మసముద్భవః- కర్మబ్ర హ్మోద్భవం విద్ధి."

యజ్ఞము కర్మమువలనఁ బుట్టినది. కర్మము బ్రహ్మ వలనఁ బుట్టినది. అనఁగా సర్వజగత్కారణభూతుఁ డైన బ్రహ్మయొక్క కర్మము యజ్ఞరూపముగనున్నది. యజ్ఞ మన యావచ్ఛక్తిని ఈశ్వరార్థముగ విని యోగించుచు ఈశ్వరున కనుకూలముగవర్తించుట ద్వారా తనయందుఁ గలయీశ్వరాంశమును బలపఱచు కొనుటగదా !

బ్రహ్మనిష్ఠు లగుమనుష్యులయందు వారివారికిం గలస్వభావమును శక్తియును భిన్నభిన్నములుగ నగపడు చున్నవి.

బ్రహ్మకర్మము: తాను చేయు కర్మమును కర్మాంగ ములను బ్రహ్మరూపముగనే చూచును.

"బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా."

అర్పణము అనఁగా హవనము అనుక్రియా బ్రహ్మము; హవిస్సు అనఁగా అర్పింపఁబడు ద్రవ్య బ్రహ్మము; బ్రహ్మాగ్నియందు బ్రహ్మచే హోమముచేయఁ

బడినది. కర్మ అంతయు నీరీతిగ బ్రహ్మ మని దృఢబుద్ధి గలవాఁడు బ్రహ్మనే పొందుదును.

"దైవయజ్ఞము: దేవతల నారాధించుటద్వారా యీశ్వరారాధనచేయుట." (భ-గీ. 25.)

"దైవమే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి."

గీ. ౪. 25.

కొందఱు యోగులు దేవాదుల నుద్దేశించి యజ్ఞమును జేయుచున్నారు. మఱికొందఱు బ్రహ్మాగ్నియందు యజ్ఞములచేతనే యజ్ఞములను యజించుచున్నారు.

పురుషసూక్తమునందు విరాడ్రూపి యగుయజ్ఞపురుషుని దేవతలు యజ్ఞము చేసిరి.

"యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాః." ఋ. 10-90-16.

అనఁగా సృష్టియందలి సర్వపదార్థములయందును బ్రహ్మ మెప్పుడును నిండియే యున్నందున నిష్కామబుద్ధితో సర్వవ్యవహారములను జేయునపుడు బ్రహ్మముచేతనే బ్రహ్మముయొక్క యజ్ఞము తప్పక యగును. కావున ఇదియే—

కామ్యయజ్ఞము: తాను చేయు కర్మఫలము తనకే చెందవలయు ననునది.

నిత్యయజ్ఞము: ఫలాపేక్ష లేక చేయు ఈశ్వరారాధనరూప మగుకర్మము.

నైమిత్తికయజ్ఞము: తాను చేయు శాస్త్రోక్త కర్మములయందు సంభవించు లోపములనుండికలుగు దోషములను బరిహరించుకొనుటకును ఈజన్మమునఁ దా ననుభవించుచున్నట్టియు ముం దనుభవింపఁ దగినట్టియు రోగాదులవలన సూచింపఁబడెడు పూర్వార్జితపాపములను బరిహరించుకొనుటకుఁ దాను చేయఁదగిన శాస్త్ర విహిత మైనకర్మము. నిమిత్తము సంభవించునప్పుడు చేయునది కాన నిది నైమిత్తికయజ్ఞము.

వాచికయజ్ఞము: వాక్కుచే నడచు వ్యాపారము లన్నియు భగవంతుని యారాధనయందే వినియోగించుట వాచికయజ్ఞము.

జ్ఞానయజ్ఞము: యజ్ఞస్వరూపమును, ఈశ్వర స్వరూపమును, జీవాత్మస్వరూపమును, స్పష్టముగా నెఱింగి కర్మనాచరించుట జ్ఞానయజ్ఞము.

బ్రహ్మయజ్ఞము: "స్వాధ్యాయే నార్చయే తర్షీన్." 'అధ్యాపనం బ్రహ్మయజ్ఞః' అను స్మృతివాక్యములవలన వేదములను బఠించుటయు, అందలివిషయము లభ్యసించుటయు ఆధర్మము లితరులకు బోధించి ధర్మములను గాపాడుటయు బ్రహ్మయజ్ఞ మనఁబడును.

దీనికంగములుగఁ జేయఁబడునవి దేవర్షి పితృతర్ప ణములు.

పితృయజ్ఞము: పితృదేవత లాదినుండి ప్రజావృద్ధి కొఱకును, బ్రజాక్షేమముకొఱకును, పాటుపడి ధర్మ ములను నడపి లోకము నభివృద్ధిచేసినవారు. ప్రతిమాన వుఁడు మానవకోటి సౌఖ్యముకొఱకు పాటుపడుచు, ధర్మకార్యములఁ జేయుచు తానుప్రారంభించిన ధర్మ కార్యములను జేయుటకును, కొనసాగించుటకును, అభి వృద్ధిచేయుటకును దగిన సత్ప్రజ నుత్పత్తిచేయుట, పితరులఋణముతీర్చుకొనుట.

"పితృయజ్ఞ స్తుతర్పణమ్
పితౄన్ శ్రాద్ధేన చార్చయేత్
ప్రజయా పితౄన్."

శ్రత్=సత్యము: "శ్ర త్సత్యం దధాతి యయా క్రియయా సా శ్రద్ధా శ్రద్ధయా యత్ క్రియతే తచ్ఛ్రాద్ధమ్." ఏక్రియచే సత్యము గ్రహింపఁబడునో అదిశ్రద్ధ. ఆశ్రద్ధచే చేయఁ బడునది శ్రాద్ధము. "తృప్యంతి తర్పయంతి యేన పితౄన్ త త్తర్పణమ్." ఏకర్మచేఁ బ్రతికియుండు మాతాపితలు ప్రసన్నులగు దురో అది తర్పణము.

దేవయజ్ఞము: "హోమై ర్దేవా న్యథావిధి." హోమములచే దేవతల నర్చింపవలయును. అగ్నియందు వ్రేల్వఁబడిన హోమద్రవ్యము తప్తమై సూక్ష్మరూపముగ మాఱి యదృశ్యు లగు దేవకోట్ల కాహార మగుచున్నది. దేవయజ్ఞమునకు విద్వాంసులసేవయనియుఁ గలదు. "విద్వాగ్ంసోహి దేవాః." (శత. బ్రా.)

మనుష్యయజ్ఞము: నృయజ్ఞోఽ తిథిపూజనమ్ న్యా నన్నై రర్చయేత్."

మానవులు సమస్తభూతములును జగదేకపిత యగు నీశ్వరునినుండియే వెలువడెను. ఆయీశ్వరుని విరాడ్రూపమునందలి యవయవములు అన్యోన్య సహకారులై వర్తించునటుల మానవు లెల్లరు ఇతరుల సుఖములకొఱకుఁ బాటుపడి పరస్పరఋణములను దీర్చికొనవలయును.

భూతయజ్ఞము: "భూతాని బలికర్మణా బలిర్భూతౌ."

సర్వభూతములతో నైక్యభావమును దృఢముగ మానవులకుఁ గలిగించి భూతతృప్తిచేయుటకొఱకు బలిప్రదానము నియమింపఁబడినది. పక్వాన్నము ఇంటిచుట్టును నలుదిక్కులను శ్రద్ధతోను, భక్తితోను, పరిశుద్ధస్థలమున నుంచవలయును. అదృశ్యులై

సంసారచక్రమును ద్రిప్పుచు నెల్లవిధముల నీశ్వరాజ్ఞా ప్రవర్తకు లగు దేవకోటులకును, మానవకోటికిని, తిర్యక్కులగుపశుపక్ష్యాదులకును, క్రిమికీటకాదులగుసమస్త భూతములకుఁ గలయైక్యభావము నీరూపమున నెఱింగి పరస్పరసంబంధము నెఱింగికొని సమానజనుల యందన్యోన్యభావమును ఉత్తములయందు భక్తియు హీనుల యందు దయయుఁ గలిగి ఋణములఁ దీర్చి యెల్లవారును గృతార్థులు కావలయును. రాగము సరి దుఃఖమును, ద్యాగముఁబోలెడు సుఖంబును లేదు.

మునులఋణ మధ్యయనమున అనిమిషులఋ
ణంబు క్రతువున అతిథిఋణంబు పూజఁ
దీర్పునది శ్రాద్ధమునఁ బితృదేవతలఋ
ణంబు, నరులఋణము రంజనవ్రతమున.

(శాం. 5 ఆ. ప. 484.)

తపోయజ్ఞము: "తప ఇతి ఆలోచనా." (బ్రహ్మ) అనన్యదృష్టితో పరమేశ్వరునిగూర్చిచేయు ఆలోచన తపస్సు. మౌనముద్రాంకితుఁడై యోగి తనయాత్మకాత్మయయిన పరమేశ్వరుని యోగనిష్ఠా గరిష్ఠుఁడై ఆత్మార్పణపూర్వకముగా ధ్యానించి తాను పరమేశ్వర సాక్షాత్కారము పొంది తనశిష్యకోటిని పరమేశ్వర ప్రసాదపాత్రులనుగాఁ జేయుటయే తపోయజ్ఞము.

ఇది కేవల మహింసాపూర్వకము, జ్ఞానమయము. కావున ఎల్లయజ్ఞములకంటె నుత్తమోత్తమమైనదీయజ్ఞము.

"ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథా ఽపరే
స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞా శ్చ యతయః సంశ్రితవ్రతాః."

గీ. 4—28.

తీక్ష్ణముగ వ్రతాచరణము చేయు యతులు (అనఁగా సంయమనశీలు రగుపురుషులు.) ఒకరు ద్రవ్యరూపయజ్ఞమును, మఱియొకరు తపోరూప మగుయజ్ఞమును, ఇంకొకరు యోగయజ్ఞమును, స్వాధ్యాయయజ్ఞమును, అనఁగా నిత్యమును స్వకర్మానుష్ఠానరూపమగు యజ్ఞమును ఇతరులు జ్ఞానరూప మగుయజ్ఞమును చేయుచున్నారు.

తపోయజ్ఞమును గావించి ధన్యుఁడగువాఁడు బ్రహ్మానందమూర్తియగు యోగివర్యుఁడగును.

యజ్ఞమయు యజ్ఞరూపుని
యజ్ఞాత్ముని నాత్మవహ్ని యజియించి తపో
యజ్ఞము చేసెడు యోగిని
అజ్ఞానముదొలఁగఁ గొలుతు ననవరతంబున్.

నియత హృదయపద్మా! నిత్య కళ్యాణ సద్మా!
స్మయ రహిత చరిత్రా! సర్వ సంస్తోత్ర పాత్రా!
నయ భరిత సుకర్మా! నమ్రతా రూప వర్మా!
భయ రహిత విభావా! భవ్య దివ్య ప్రభావా!

శ్రీ లీలా సంవర్ధిత
కాలోచిత దాన మహిత ఘనతరకార్యా !
ఆలోచనాత్త చర్యా ?
లాలిత నృప నీతిధుర్య రామయ్యార్యా !
దివ్యచిత్తంబున అవధరింపుము.

## తపోభూమి

### పురుషార్థములు

లోకములో నెల్లవారును సర్వదా సుఖము నన్వేషింతురు. ప్రాజ్ఞులును, పామరులును, పుణ్యాత్ము లును, పాపిష్ఠులును, ధనికులును, దరిద్రులును, వీరు వారను నియమము లేక సమస్తజనులును సర్వకాల సర్వావస్థలయందును సుఖమునే కోరుచుందురు. ఎవ్వఁ డేకార్యము చేసినను సుఖలాభమే వానిమనోభీష్టమై యుండును. అట్టిసుఖ సంపాదనమునకు ధర్మము, అర్థము, కామము, మోక్షము నను నాలుగు సాధనము లేర్పడి యున్నవి. వానినే చతుర్విధ పురుషార్థము లందురు. పురుషార్థ మనఁగా పురుషుఁ డపేక్షించు ప్రయోజనము. కామ్యంబులగు శాస్త్రవిదితకర్మంబుల నారంభించునపుడు 'ధర్మార్థ, కామ, మోక్ష, చతు ర్విధ పురుషార్థ సిద్ధ్యర్థ' మ్మని సంకల్పించుకొనుట సర్వసామాన్యము.

ధర్మము పురుషార్థములలో మొదటిదియుఁ దక్కిన మూఁటికి నాధారభూతము నై యున్నది.

అర్థము ధర్మానుసరణముగ నార్జింపవలయును. లేనిచో
నది సుఖకారణంబు గా నోపదు. కామము ధర్మము
నకు విరుద్ధము గాకుండునట్లు అనుభవింపవలయును.
అట్లు గాకున్న నయ్యది దుఃఖహేతువగును. ధర్మా
చరణమువలనఁగాని మోక్షము లభింపదు. కావుననే
ధర్మమే సర్వపురుషార్థసాధనము.

"ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా" (తై. ఉ.)
ధర్మముయొక్క ఆధారము మీఁద జగత్తంతయు
నిలిచి యున్నది.

"ధారణా ద్ధర్మ ఇత్యాహుః ధర్మో
ధారయతి ప్రజాః" భారత.

'ఈప్రపంచము నంతను ధరించునది గాన ధర్మ
మనఁ బడును. ధర్మమే ప్రజలను నిలువఁ బెట్టుచున్నది.'
ధర్మమనునది యీశ్వరాజ్ఞ. ఏకాలమున నేదేశమున
నేకార్య మెటుల జరుగవలసినట్లు భగవంతుఁడు సంక
ల్పించెనో యది ధర్మ మనంబడును. కాఁబట్టి దేశకాల
విభాగము ననుసరించి ధర్మము మాఱుచుండును. ప్రతి
మనుజుఁడు ధర్మస్వరూపము దెలిసికొని తనబుద్ధిని
నిర్మలముగాఁ జేసికొని యట్టినిర్మలబుద్ధితో విచారించి
ధర్మమార్గమును గనిపెట్టవలయును. ఏలయనఁ బ్రతి
మనుజుఁడును సుఖమునే కోరును. ధర్మప్రవృత్తివలననే

మనుజునకు సుఖము గలుగవలసినట్లు లీశ్వరుని సంకల్ప మైయున్నది. అదియమోఘ సంకల్పము. ధర్మమార్గ మున సంచరించుటవలననే సుఖముగలుగునుగాని వేఱు విధమునఁ గలుగదు. అధర్మమువలన నొకప్పుడు తాత్కాలికమునకు సుఖముగఁ దోఁచినను అది కాల క్రమమున దుఃఖముగాఁ బరిణమించునే కానితప్పదు.

"సుఖ మిచ్ఛంతి సర్వేపి త చ్చ ధర్మసముద్భ వమ్." ప్రతిమనుజుఁడును సుఖమును దన స్వధర్మముం దెలిసికొనవలయును. ధర్మ మభ్యాసముచే నెఱుఁగఁ దగినది. ఏమనుజుఁడుగాని తెలిసినమట్టుకు ధర్మము తప్పక యాచరించుకొలఁది వానికి ధర్మస్వరూపము గోచరించును. అనుష్ఠానము లేనివాఁ డెంతపండితుఁ డైనను ధర్మ మెఱుంగఁజాలఁడు.

అర్థము: పురుషార్థములలో నొక్కటి. ధర్మము నకు అర్థసహాయము కావలయును. అర్థములేని వానికి కామభోగములు లభింపవు. మోక్షసాధనము లగు సత్కార్యములకును, అర్థ మావశ్యకమై యుండును. కావునఁ దక్కిన పురుషార్థముల మూఁటికి నర్థము సహకారి యగును. అర్థములేని వాఁడు వ్యర్థుఁడు. ఇహలోకసంబంధ మగుసమస్తకార్యములకు ధన మావ శ్యకము. ఎల్లవారికి శరీరపోషణ అపరిహార్యము. పామర

జనులకు మాత్రముగాక జ్ఞానులకు, విరక్తులకు, పరమ వేదాంతులకు, సర్వసంగ పరిత్యాగులకును దేహపోష ణము ముఖ్యకర్తవ్యంబు. ప్రకృత దేశ కాలపరిస్థితిని బట్టి యెంతటివానికైన నర్థసహాయము లేక శరీర యాత్ర జరుగదు. జీవుఁ డెందాఁక ఁపన్నకోశగతుఁడై వర్తించు నందాఁక నన్నాదు లాతనికిఁ గావలసియుం డును. శరీరము ధర్మసాధనములలో మొదటిది.

"శరీర మాద్యంఖలు ధర్మసాధనమ్."

దానిని దృఢముగను, బలిష్ఠముగను, అనా మయముగను ఉంచుకొనుట అందఱికిని నియత ధర్మము. ఆయుస్సత్త్వంబుల ఆరోగ్యసుఖంబుల వృద్ధిపొం దించునట్టి సాత్వికాహారంబును, శీతాతప వర్ష బాధల నొందకుండ యథోచిత వస్త్రాచ్ఛాదనంబును, నివాస స్థానవసతియు నెల్లవారికిఁ గావలయును. ఇవి లేకున్న నెవ్వరికిని శరీరయాత్ర జరుగదు. ఎవ్వనికి ఇవి పుష్కల ముగా అమరియుండవో అట్టివాఁడు ఘనకార్యమేమి యుఁ జేయఁ జాలఁడు. ప్రాతఃకాలమున నిదుర లేచి నప్పటినుండియుఁ, కేవలోదర పోషణనిమిత్తమై పాటుపడవలసినవానికి విద్యాభ్యాసమునకుఁగాని, జ్ఞాన సంపాదనకుఁగాని, పారమార్థికవిచారమునకుఁగాని, లోకోపకారక మగుకార్యమే దేనిచేయుటకుఁగాని కాల

వ్యవధి యుండదు; బుద్ధియుఁ బ్రవేశింపదు. వాని కాలము, శక్తి, బలము, నన్నియు కేవలజీవనోపాధి నెదకికొనుటయందే సమసిపోవును. కేవలజీవనాధార మునుగూర్చిన విచారములేనివాఁడె లోకోపకారకకృత్య ములుచేయఁ జాలును. సంపాదించినధనమునకుఁ బాత్ర మెఱిఁగి దానముచేయుట యుత్తమమగునని యోగము; తాననుభవించుట మధ్యమపక్షము. కూడఁబెట్టుట అధమపక్షము.

కామము: పురుషార్థములలోఁ జేరినది కాద నియుఁ గేవలము తుచ్ఛమైన దనియు సర్వవిధముల వర్జింపఁదగినదనియు ననేకులు తలంచుచుందురు. అటుల దలఁచుట సరికాదు. అది యట్టి దయ్యేనేని పురుషార్థ ములలో నొకటిగా నెట్లుగణన కెక్కును? పురు షార్థములు పురుషునకు శ్రేయస్సాధకములు.

"ధర్మా విరద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ."

భ-గీ. 7–11.

ధర్మమునకు విరుద్ధముకాని కామమును నే నగుదు నని భగవంతుఁడే సెలవిచ్చినాఁడు. అట్టి కామము భగవదంగీకారమై భగవత్సంకల్పములో నణఁగి భగవద్విభూతిలోఁ జేరినదై యుండును. కావున ధర్మము తప్పక కామము ననుభవింపవలయును. కామ

మనఁగా కోరిక. మనుష్యునకుఁగల సమస్తము లగు కోరికలును కామ మనఁబడును. ధనకామము, పుత్త్ర కామము, సుఖకామము, యశఃకామము, స్వర్గకామము మొదలగునవి యెల్లఁ గామవిశేషంబులై యుండును. "ఆనందో బ్రహ్మ." యని శ్రుతివాక్యము. ఈశ్వరుఁడానందస్వరూపుఁడు పురుషుఁడు భగవ దంశసంభూతుఁడు గాన వాఁడు ఆనందస్వరూపుఁడై యుండును. పురుషుఁ డంతర్ముఖుఁడై స్వస్వరూ పానుసంధానము చేయునప్పుడు ఆత్మానంద మనుభవించుచుండును. అట్లు చేయక బహిర్ముఖుఁ డయ్యేనేని ఆయానందస్వరూపము ఇచ్ఛాశక్తిరూపమునఁ బరిణమించి సుఖమ్ము నన్వేషించుచుండును. అట్టి యిచ్ఛాశక్తి ప్రాపంచిక విషయముల లోనికి దిగి సుఖాన్వేషణముచేయఁ గడంగినచో నయ్యది కామ మనంబడును. కాన బ్రహ్మానందమునకును విషయసుఖమునకును తారతమ్యభేదమే కాని రూపభేదము లేదు. ఆత్మస్వరూప మగునానందము యొక్క ప్రాతిభాసికమే కామము. ఆత్మస్వరూపము ననుభవించుట యానందము. విషయముల ననుభవించుట కామసుఖము. ఆనందమునకు నన్యపదార్థములతో నక్కఱలేదు. కామమునకు వేఱొకవస్తు వావశ్యకము. కామమనఁగాఁ బురుషునకుఁ దనకంటె నన్య

పదార్థముపైఁ గలయాశ. సామాన్యనరునియందు ఆనందస్వరూపము భూమియందు నాటఁబడిన విత్తనము వలెఁ బ్రకృతిచే నావరింపఁబడి నిస్తేజమై యణఁగి యుండును. పురుషుఁడు సుఖము ననుభవింప ఆనందము కొంచెము కొంచెముగ వికసించి ప్రకాశ మగును. కావున స్వస్వరూపానందానుభవమునకు విషయసుఖానుభావ మత్యంతావశ్యకము. విషయ సుఖములు క్షణభంగురములు. ఆత్మానందము శాశ్వతము. కామమువలన (కోర్కె) బుద్ధిబలమును గ్రియాశక్తియుఁ బ్రవృద్ధి నొందును. కామములేనిచోఁ బురుషుఁ డేవస్తువునుగాని కోరఁడు. అట్టివాఁ డెన్నటికిని బురోభివృద్ధిఁ గాంచఁడు. ఎవనికోరికలు శ్రేయోభివృద్ధికిఁ గారణములగునో యయ్యవి ధర్మయుక్తములు. కామము ధర్మయుక్తము కాకుండునేని సర్వానర్థములకుఁ గారణమగును.

మోక్షము: పురుషార్థములలో సర్వోత్కృష్టమైనది. ఇదియె పరమపురుషార్థము. మనుష్యుఁడు కోరఁదగినదియు, ఎల్లవిధంబుల సాధింపఁదగినదియు నిది యొక్కటియె. తక్కినమూఁడును దీనిని సాధించుటకు నుపాయములు, సాధనములును, కాని తమంత నపేక్షణీయంబులు కావు. మోక్షము సమస్తజనులచేతను

గోరఁ దగినది. మోక్ష మనఁగాఁ బ్రకృతిబంధము నుండి విడుదల. ప్రతిమనుజుఁడు ఏడులోకములఁ (భూ, భువ, స్వ, మహ, జ, త, స) బ్రకృతిచే బద్ధుఁడై యున్నాఁడు. ఈసప్తలోకముల ప్రకృతిని జయించి ఒక్కొక్కలోకమునందును పరిపూర్ణప్రజ్ఞ కలవాఁడై యేలోకమునందుఁ గాని యేవస్తువుపైఁ గాని యాశలేకుండువాఁడు బంధవిముక్తుఁ డగును.

"ఆబ్రహ్మభువనా ల్లోకాః పున రావర్తి నో ఒ ర్జున
మా ము పేత్య తు కౌం తేయ పునర్జ న్మ న విద్య తే."(భ-గీ)

'ఓయర్జునా! బ్రహ్మలోకము మొదలుకొని స్వర్గాదిలోకములవఱకును, గల లోకములన్నియు ఎప్పుడో యొకప్పుడు పునరావర్తనమును (తిరిగివచ్చుట) బొందును. కాని కౌంతేయా! నన్ను నొందుచువేని పునర్జన్మము లేదు.'

ఆత్మజ్ఞానము కలిగినవారికి మాత్రమే (ప్రత్యక్షముగ ఆత్మదర్శనముచేసినవారికి) నిత్యానంద మగు మోక్షపదము లభించును. ఇదియే స్వస్వరూపానుభవ మనియు, ఆత్మసాక్షాత్కార మనియు, బ్రహ్మసాక్షాత్కార మనియు, అపరోక్షజ్ఞాన మనియు మన గ్రంథములం దనేకవిధముల వర్ణింపఁ బడియున్నది. మనుజుఁడు తనయొక్క నిజస్వరూపమును బ్రత్యక్షముగ

నెఱుంగవలయును. ప్రపంచము అన్ని వస్తువులలోప లను వెలుపలను నిండి నిబిడీకృతమైయున్న పర మాత్మస్వరూపమే తా నని స్వయముగ నెఱుంగవల యును. ఇతరులు చెప్పఁగా వినిగాని, గ్రంథములు చదివిగాని, యీవిషయమును గ్రహించి ఆస్తిక బుద్ధితో నమ్మినచో నదిపరోక్షజ్ఞానమే. ప్రత్యక్షముగ ననుభవించుటయే నిజమైన యాత్మజ్ఞానము. అదియె మోక్షజ్ఞానము. ఆత్మజ్ఞానము గలవాఁ డీలోకమునం దున్నను, ఏశరీరమందున్నను, బాహ్యస్థితి యెట్లున్నను మోక్షానందమున ననుభవించుచుండును.

ఏలోకమునన్నను ముక్తు లందఱు భగవత్సం కల్పమును స్వయముగా నెఱిఁగినవారై దాని నెఱవేర్చు టయే యేకవ్రతముగఁ గైకొని, సర్వదా లోకోపకార మునకై పాటుపడుచుందురు. జీవన్ముక్తులు ముక్తినొం దియు, విదేహముక్తులు (స్థూలశరీర రహితులై సూక్ష్మ శరీరమున సంచరించువారు.) దేహధారులయ్యు భూలోక మునఁజరించుచుండెడివారు. వ్యాసాదిమహర్షులు జీవన్ము క్తులు. అట్టిమహనీయు లిప్పుడును ఉన్నారు. వారీశ్వ రాజ్ఞాధురంధరులై సంసారసముద్రమున మునిఁగియుం డెడు జీవుల నందఱిఁ దరింపఁజేయుటకై శరీరముల ధరించి లోకమునఁజరించుచున్న దయామయమూర్తులు.

"శాంతా మహాంతో నివసంతి సంతో
వసంతవ ల్లోకహితం చరంతః
తీర్ణా స్స్వయం భీమభవార్ణవం జనా
నహేతు·నా న్యానపి తారయంతః."

'నేను దేహమాత్రుఁడను కాను. దేహము ఉపకరణమాత్రము. దేహినైన నేను దేహమును నాయిచ్ఛానుసారము నడుపుశక్తికలిగినవాఁడను. నాకుఁ గర్తవ్యమని తోఁచునట్టి కార్యములను నేను చేయుట కుపయుక్తమైనసాధనము దేహము.' అని పనిచేయువాఁడు పురుషుఁడు. దేహవ్యతిరిక్తుఁడను నేను, దేహమునకు నేను ప్రభువను. నేను చెప్పినట్లు వినఁదగినది దేహము. అని యెవఁడు తెలిసికొనియున్నాఁడో యెవఁడు ఈ తత్త్వార్థమును జెప్పినతోడనే తెలియుటకు శక్తికలిగియున్నాఁడో అతఁడే యీవిచారమును జేయుటకర్హుఁడు. అట్టివాఁ డపేక్షింపఁదగినవి పురుషార్థములు. పురుషార్థములచే సాధింపఁదగినది మోక్షము. మోక్షార్థియై ధర్మార్థకామములను సాధించువానికి లభించుసుఖము నిత్యము. నాశనరహితమైనది. ఫలాపేక్షతో చేయుకర్మములె కామ్యకర్మములు. తాను జేయుకర్మము తనకుఁ జేరవలెనని అపేక్షింపనివానికర్మము నిష్కామము. అట్టివాఁడు చేయుకర్మఫలము లోకమునకుఁ

జేరను వానికి బంధము కానేరదు. ఈరీతిగా శాస్త్ర విధిప్రకారముగాఁ దాఁ జేయఁదగిన కర్మము లన్నియు యావచ్ఛక్తిని లోకోపకారార్థమై యీశ్వరకైంకర్య రూపముగాఁ జేయువాఁడే సహజమగు ఆత్మానంద మందును. ఆత్మసుఖము సహజమైనదగుటచేతనే వాని సుఖమునకుఁ జ్యుతిలేదు.

"ఆత్మలాభా న్నపరం విద్యతే." (ఆప. సూ.)

ఆత్మలాభముకంటె నధికమైన దేదియును లేదు. కావుటంజేసియే ఆత్మోపలబ్ధి నొంది తన్నాశ్ర యించినవారికి ఆత్మసాక్షాత్కారలాభము నీతపోభూమి కలిగించుచున్నది. నిత్యమైన ఆత్మానందలాభమునకు సాధనభూతమైనకర్మమే ముఖ్యధర్మము. అందువలననే యాజ్ఞవల్క్యముని

"ఇజ్యాచార దమాహింసా దాన స్వాధ్యాయ కర్మణాం అయంతు పరమో ధర్మో య ద్యోగే నాత్మదర్శనమ్."

అనిచెప్పినాఁడు. యోగముచేత ఆత్మదర్శనము చేయుటయే యోగాది ధర్మములలో పరమధర్మము. ఆత్మదర్శనమే ఆత్మలాభము. దానికి సాధనము యోగము. యోగమునకు అంగమైనది నిష్కామ కర్మము. అట్టికర్మానుష్ఠానపరుఁడై మోక్షమను పరమ పురుషార్థసిద్ధి గాంచినవాఁడె యోగి.

"శ్రద్ధయా దేయం, అశ్రద్ధయా ఽదేయం,
శ్రియా దేయం, హ్రియా దేయం, భియా దేయం
సంవిదా దేయం (శ్రుతి)

దాత, ప్రతిగ్రహీత, పదార్థము, లోపము, సర్వము బ్రహ్మస్వరూపములు.
దానం యజ్ఞానాం వరుణథం దక్షిణాలోకే." (తై.)

నివృత్తిమార్గమున నడువఁ గాంచువానికి దానము మిగుల శ్రేయోదాయకము. తనయందలి భగవంతునిసంకల్పములు వెలుపలికి నభివ్యక్తమగునట్లు తపోభూమి ప్రాణముగలిగి జ్యోతిర్మయమగు నగ్నిశిఖయుంబోలె తన ఈశ్వరసంబంధమగు ప్రేమమును లోకముపై నంతయుఁ గిరణములవలెఁ బ్రసరింపఁజేయుచుండును.

కుటల చికుర జాలా! క్రూర హృచ్ఛాత శూలా!
పటుతర రిపు హంతా! స్వర్గకాం తాభి రంతా!
ఘటిత విబుధ భద్రా! కార్యదీక్షావినిద్రా!
జటి వినుత విహారా! సాంద్ర ధర్మప్రచారా!

శ్రీ ధర్మాంచిత జన్యా
శ్రీ ధీ మహి మా ప్రలోభ వృతకృతికన్యా
శ్రీ ధాన్యాధిక దానా
రాధిత జనలోకమాన్య! రామయధన్యా!
దివ్యచిత్తంబున అవధరింపుము.

## తపోభూమి

### మతము

ఈశ్వరుని స్వరూపమును జీవస్వరూపమును, ఈ రెండింటికిఁగల పరస్పరసంబంధమును, జీవు లీశ్వర సాన్నిధ్యమును జేరుటకుఁ దగినసాధనమును అందుకుఁ బ్రపంచ మాధారముగ నుండుటయు, వీనిని విశదపఱచుటయు ముఖ్యప్రయోజనముగాఁ గలది మతము.

లోకమం దంతటను బ్రాహ్మణులే యుండు వారనియు రాను రాను వారందఱును క్షీణించి పలుజాతులుగా విభాగ మైరనియు మఱియుఁ గొంత కాలమునకుఁ దిరిగి యందఱు బ్రాహ్మణు లగుదురనియు మహాభారత మందుఁ జెప్పఁబడి యున్నది. అట్టికాలము సమీపించుచున్నది. ఆర్యు లైనను అనార్యు లైనను ఋషు లైనను బ్రాహ్మణు లైనను మన దేశస్థులందఱికిని మన పూర్వు లొక్కపని యాజ్ఞాపించియున్నారు. అది యెల్లరు సమానముగా నవలంబింపఁదగిన దై యున్నది.

మీ రెల్లప్పుడును వృద్ధి నొందుచుండవలయు ననియు అత్యధికుఁడు మొదలు చండాలునివఱకు

నందఱుఁ బ్రయత్నించి బ్రాహ్మణులు కావలయుననియు నాజ్ఞాపించునదే వేదమతము. ఈయభిప్రాయము లోక మంతకు వర్తించును. మానవు లెల్లరు క్రమక్రమ ముగా నభివృద్ధిచెంది యాత్మవిద్యను అనుభూతికిఁ దెచ్చుకొని క్షమావంతులై భక్తిరతులై ధ్యానగరి ష్ఠులై తత్వవేత్త లగుటకుఁగాను మన కీవర్ణభేద మేర్పడినది.

"బ్రాహ్మణోస్య ముఖ మాసీ; ద్బాహూరాజన్య కృతః. ఊరూ తదస్య వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత."

పురుషశబ్దముచేత నిరాకారుఁడును వ్యాపకుఁ డును నగుపరమాత్మకు అనువృత్తికలుగుచున్నది. అతఁడు నిరాకారుఁ డగుటచే నతనికి ముఖాది అంగ జాలములు కలుగఁ జాలవు. ముఖాది అంగములుకల వాఁడు పురుషుఁడు. అనఁగా వ్యాపకుఁడు కాఁజాలఁడు. వ్యాపకుఁడు కానివాఁడు సర్వశక్తిమంతుఁడును, జగత్తు యొక్క స్రష్టయు ధర్తయుఁ బ్రళయకర్తయు, జీవుల పుణ్యాపాపముల వ్యవస్థచేయువాఁడును, సర్వజ్ఞత్వత్వ అజన్మ అమృతత్వాది విశేషవంతుఁడును కాఁజాలఁడు. కాఁబట్టి పూర్ణుఁడును వ్యాపకుఁడును నగుపరమాత్మ యొక్క సృష్టిలో శరీరమునందు ముఖమువలె నందఱి యందును ముఖ్యుఁడు అనఁగా నుత్తముఁడగు నతఁడే బ్రాహ్మ

ణుఁడు. బలవీర్యములు("బాహ్వోర్వైబలమ్, బాహ్వోర్వై వీర్యమ్.") ఎవనియందు అధికముగా నుండునో అతఁడు క్షత్రియుఁడు; ఊరువులయొక్క బలముచేత సమస్త దేశములయందును వచ్చుచుఁ బోవుచు సమస్త పదార్థములయందును బ్రవేశముకలవాఁడు వైశ్యుఁడు. పాదములు సర్వాంగమునకు ఆధారభూతము లైనట్లు సర్వులకు నాధారభూతుఁడై నవాఁడు శూద్రుఁడు. తక్కినశతపథాదిబ్రాహ్మణాదులయందును ఈమంత్ర మున కిట్లే యర్థము చేయఁబడినది. అనఁగా "యస్మా దేతే ముఖ్యా స్తస్మా న్ముఖతో హ్యసృజ్యంత." ఇత్యా దులు ముఖ్యమగుటచే ముఖమునుండి యుత్పన్న మయ్యె నని చెప్పుట సంగతము. ముఖము అంగము లన్నిటిలో శ్రేష్ఠ మైనట్లు పూర్ణవిద్యచేతను, ఉత్తమగుణ కర్మస్వభావముచేతను యుక్తుఁడగుటవలన మనుష్యజాతి యందు నుత్తముఁ డగువాఁడు బ్రాహ్మణుఁడనఁబడును.

పరమేశ్వరుఁడు నిరాకారుఁడగుటచే ముఖా ద్యంగకములే లేనప్పుడు ముఖమునుండి యుత్పన్న మగుట యసంభవము. ముఖాద్యంగకములనుండియే బ్రాహ్మణాదు లుత్పన్నులయి యుండి రేని ఉపాదాన కారణమువలె బ్రాహ్మణాదుల ఆకృతియుఁ గావలయును. ముఖముయొక్క ఆకారము గుండ్రముగానుండునట్లే

వారిశరీరములును గుండ్రముగా నుండవలయును. అట్ల గుచుండుటలేదు. ఎవ రేని ముఖాదులనుండి యుత్పన్న మగుటచేత నే బ్రాహ్మణాది సంజ్ఞ యని చెప్పి రేని ముఖాదులనుండి యుత్పన్న మైనవారికి బ్రాహ్మణాది సంజ్ఞ యుండ వచ్చునుకాని వారికిఁ గాదు. వారును అందఱివలెనే గర్భాశయములనుండి యుత్పన్నులగు చున్నారు. ఎవరియందు నేయేవర్ణముల గుణకర్మము లుండునో వారి వారికి నాయావర్ణముల యధికార మీయవలయును. ఇట్టియవస్థచే మనుష్య లంగటును ఉన్నతశీలు రగుదురు.

ఈవర్ణ మిట్టిపనిచేయవలయు నని కర్మనిర్దేశ మేవర్ణనమునకు వేదము చేయలేదు. వేదకాలము నాఁడు ఒక్క తెగలో నున్నపదుగురుఁ బదివృత్తులు చేసి జీవించుచుండిరి.

"వైద్యుఁడు మదీయజనకుండు, వంది నేను,
నవసి విసురుచుండును పిండి నాదుజనని,
విత్త మాసించియే మేము వివిధగతుల
నందఱము పాటుపడుదుము;" ఋ. 9-112. 1-4.

అట్టి తెగలో బ్రహ్మత్వ మొందఁగోరుహక్కు ప్రతివానికిఁ గలదు.

"నజాతిః పూజ్యతే రాజన్ గుణాః కల్యాణకారకాః
చండాల మపి వృత్తస్థం తం దేవా బ్రాహ్మణం విదుః."
(భార. అశ్వ.)

జాతిమాత్రము గౌరవభాజనము గాదు. కళ్యాణ కారకము లగుగుణములే పూజింపఁదగినవి. వృత్తస్థుఁడైన చండాలుఁడుగూడ బ్రాహ్మణుఁడే. కావుననే హర్షచక్రవర్తిసభలో బాణమయూరాది మహాకవులతోఁ దుల్యగౌరవ సత్కార మును దివాకరుండను మతంగకులజుఁడు పొంద గలిగెను.

"అహో ప్రభావో వాగ్దేవ్యాః
యన్మాతంగ దివాకరః
శ్రీహర్ష స్యాభవత్ సభ్యః
సమో బాణ మయూరయోః."

వాయు వెట్లు సర్వులకుఁ బీల్పఁ దగినదో, నదీజలంబు లెట్లు ఎల్లరకు పానయోగ్యములో ఎండయు వెన్నెలయు నందఱకు నెట్లు ననుభవయోగ్యములో అట్లే పరమేశ్వరతత్వము గూడ నందఱకు సేవ్యమే. దీనికి వర్ణభేదములేదు. అప్రతిహత మగు నీయుద్యమము శాఖోపశాఖలుగా దేశమంతటను వ్యాపింపఁజేసి యార్ష యుగమును నెలకొల్పుటయే విధిగా తపోభూమి తలపెట్టినది.

వేదాధికార మెల్లరకుఁ గలుగుట స్త్రీపురుషు లందఱును వేదముననుసరించి కర్మయోగము నాశ్రయింపవలెను. 'కవియు, సర్వజ్ఞుఁడు, పురాతనుఁడు, శాసించువాఁడును సణువుకంటెఁగూడఁజిన్న వాఁడును, నన్నిటికిని ధాతయు (ఆధారభూతుఁడు, కర్త.), అచింత్య స్వరూపుఁడును చీకటివెలుపలభాగమున నున్నసూర్యుని వలె దేదీప్యమానుఁడు నగునీశ్వరు స్మరించుచు అంత్య కాలమందు (ఇంద్రియనిగ్రహరూపమగు) యోగసామర్థ్యముచేతను, భక్తిచేతను, యుక్తుఁడయి మనస్సును స్థిరముగఁజేసి ప్రాణమును కనుబొమల మధ్యమందు బాగుగ నునిచి భజించుచు, వేదవేత్తలు దేనినక్షరమని చెప్పుచున్నారో, వీతరాగుఁడై యతి దేనియందు ప్రవేశించుచున్నాడో, ఎవరినికోరి బ్రహ్మచర్యవ్రతము నాచరించుచున్నాఁడో ఆపదమును (ఓంకారబ్రహ్మను) ఆత్మ నిలుపుకొని అన్ని (యింద్రియరూప) ద్వారములను అరికట్టి మనస్సును హృదయమందు నిరోధించి తనప్రాణమును మూర్థమందుఁ జేర్చియు, యోగ ధారణమును జెంది "ఓం" అనునేకాక్షరబ్రహ్మమును జపించుచు అనన్యభావుఁడై (భ-గీ. 8, 9—13.) తపోయజ్ఞనిమగ్నుఁడై యుండువాఁడె బ్రహ్మానందముగల యోగి.

సామాన్యజనులబుద్ధికిఁ గోచరముగాక వివేక శాలురు శాస్త్రముఖంబున నెఱింగి సాధింపఁదగిన సుఖము అలౌకికము. ఈయలౌకిక, సుఖమును బొందు టకుఁ దగినయుపాయమే 'ధర్మము.

"చోదనాలక్షణో ర్థో ధర్మః." (జై. సూ.; 1-1-2.)

ఈలక్షణవాక్యమునందు చోదనాలక్షణము, అర్థము, ధర్మము అను మూఁడంశములు గలవు. చోదనాలక్షణమనుటచే ధర్మముయొక్క ఫలమును, ధర్మము అనుటచే ధర్మముయొక్కస్వరూపమును సూచింపఁబడుచున్నది. చోదనయనఁగా బ్రేరణ. ఒకానొక యధికారి యొకపురుషుని 'నీవీపని చేయుము' అనియైనను 'వలదు' అనియైనను విధించుట లేక యాజ్ఞాపించుట. కావున వేదోక్తమార్గంబున తపోభూమి సర్వ మానవులను సముద్ధరించుటకు ధర్మయోగము నూని 'ఓంకార' పూర్వక జ్ఞానము నుపదేశించి కైవల్యాశ్ర మమును సాక్షాత్కారము చేయుచుండును.

"ధారణా ద్ధర్మ మిత్యాహు ర్ధర్మో ధారయతే ప్రజాః
య త్స్యా ద్ధారణసంయుక్తం స ధర్మ ఇతి నిశ్చయః."

(భా. కర్ణ. 66—56.)

'ధర్మ'శబ్దము 'ధృ ధారణే' అనుధాతువునుండి నిష్పన్న మైనదగుటచే ధర్మముచేతనే ప్రజలం దఱును

బద్ధులు. దేనిచే సమస్తప్రజల ధారణ మగునో యదియే ధర్మ మని నిశ్చిత మగును గాన సర్వమానవ సంతరణ సాధన మగు ఓంకారమంత్రము జపించుటయే తపోయజ్ఞము. దాని నాచరణపూర్వకము గాఁ జూపు నది తపోభూమి.

తపస్సుఅనఁగా అరణ్యమున కేగి పాతంజల యోగ ముచే శరీరమును గష్టపెట్టుటకాదు. శుచిత్వము, సరళత, బ్రహ్మచర్యము అహింసయుఁగలిగి, మనస్సునకుఉద్వేగము నీయనిదియు, సత్యమును, ప్రియమునుహితకరమును నైన భాషణముచేయుచు, స్వాధ్యాయము(స్వకర్మాభ్యాసము) నూని మనస్సును ప్రసన్నముగా నుంచికొని, సౌమ్యత, మౌనము (మునివలెఁబ్రవర్తించుట) మనోనిగ్రహము, శుద్ధభావము కలిగివర్తించుట తపస్వియొక్కవిధి(6—16).

"సత్యం బ్రూయాత్, ప్రియం బ్రూయాన్న బ్రూయా
త్ సత్య మప్రియమ్
ప్రియం చ నానృతం బ్రూయా దేష ధర్మ స్సనాతనః."

మ. 4—138.

సత్యము మాటలాడవలయును, ఇష్టముగ మాట లాడవలయును, సత్యమైనను అప్రియము నాడరాదు, అను సనాతనధర్మము వహించి ఫలాశను వదలి అధిక శ్రద్ధతో యోగయుక్తబుద్ధితో (గీ. 17.)

ఓం త త్సత్.

అనుమంత్రార్థము నెఱింగి నామరూపాత్మకమగు నేకాలముచే సర్వము గ్రహింపఁబడినదో, యాకాల మును సయితము గ్రహించునది, లేక, పాకముచేయు నది యగు తత్త్వమే పరబ్రహ్మముగా నెఱింగి (మై. 6-15) "నత ద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః"

పరమేశ్వరుని స్థానమును బ్రకాశింప జేయుటకు సూర్య చంద్రాగ్నులవలెఁ బ్రకాశముగలసాధనము లెవ్వియును లేవు గాన నది స్వయంప్రకాశముగనే యున్నది (గీ 15. 6 కఠో 5-15 శ్వే 6-14) ఏదేవుని "జ్యోతిషాం జ్యోతిః" "తేజస్సునకుఁ దేజస్సు" (గీ 13-17; బృ 4-4-16) అని చెప్పుచున్నారో ఆస్వ యంప్రకాశమును జ్ఞానమయమును నగు బ్రహ్మము నాత్మ నెఱుంగువాఁడె బ్రహ్మయోగి

"విశ్వో దేవస్య నేతు ర్మర్తో వురీత సఖ్యం"

ఋ. వే. 5–10

ప్రతిమనుష్యుఁడును ఈశ్వరుని సఖ్యమును గోరఁదగును. దానిని గోరుటకుఁ బ్రతివానికి హక్కుగలదు. అదియే యొక్కజాతికిఁ బ్రత్యేకింపఁబడిన జన్మస్వత్వముగాదు. "అస్య ధర్మస్య సర్వజ్ఞః కల్పాదే పరమేశ్వరః వ్యంజకః కేవలం విప్రా నైవ కర్తా న సంశయః"

కల్పాదియం దీధర్మమును పరమేశ్వరుఁడు బయ ల్పఱిచనే కాని కల్పింపలేదు. ధర్మమునకు ఁగర్తలెవరును లేరు. కావున యజ్ఞము మూలమునఁ దరించుట యెల్ల రకు ధర్మ మని తపోభూమి సందేశము

"వేదజ్ఞులతో సంచరింపక దేవతలనారాధింపక యుండునట్టి విద్యావివేకశూన్యులు బ్రాహ్మణులుకారు; ఋత్విక్కులును గారు" అనుఋగ్వేద (ఋ10-71) ధర్మమూఁది వేదధర్మావలంబులై తపోయోగము నంది తపోయజ్ఞముచే సుకృతులై నిష్కామకర్మాచరణులై "తత్వమసీ" త్యాదివాక్యముల నాత్మానుసంధానము నొంది

"ఎవరు నిత్యుఁడయిన యావేదవేద్యునిఁ దెలిసి కొందురో వారే జ్ఞాతలై పునరావృత్తిరహిత మైన బ్రహ్మత్వమును బొందుచున్నారు" అని ఋగ్వేదాను సారముగాఁ బ్రచారముచేయునదే తపోభూమి.

"నేహ నానా స్తి కించిన"

ఈజగత్తునందు నానాత్వము లేదని తెలిసికొనినవాఁడు ముక్తుఁడు.

"మృత్యో స్స మృత్యు మాప్నోతి య ఇహ నా నేవ పశ్యత్ (బృ 4-4—17)

ఎవఁడు జగతునందు నానాత్వమును జూచుచున్నాఁడో

వాఁడు జననమరణచక్రముందు పడుచున్నాఁడు కాన మానవుఁడు ఏకత్వబోధకుఁడు కావలయును.

"సమానీవ ఆకూంతిః సమానాహృదయాని వః, సమాన మస్తువో మనో యథావః సుసహాసతి". (ఋగ్వే)

యథా వః సుసహాసతి.

ఆర్యులారా!

ఎట్లు మీరందఱికిని శుభప్రదమైన కూడిక సంభవించునో అట్లు మీసంకల్ప మేకవిధమగుఁగాక. మీహృదయము లేకమగుఁగాక. మీయంతఃకరణము లేకీభవించుగాక.

ఇతి శివమ్

శ్రీకృష్ణార్పణమస్తు.

జయతు జయతులోకే తెల్గురా డస్వవాయః
జయతు జయతు నాకే రామ శాస్త్ర్యావ్యామో యః
వితరణగుణ ధుర్య శ్శౌర్య దార్ఢ్య ధైర్యః
కృతిపతిముఖ నేయ స్స్వఃప్రజా వ్రాత గేయః.

---

అసతి = అసి, అను వైదికరూపము; యథావః. సహా సతిఅని రెండు మాఱులు చెప్పుట గ్రంథసమాప్తి సూచన.

